# నిబంధనలు



౧. ఇందు జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా ౦—౪—౦ లు చెల్లింపవలయును.

౨. ఇందు రెండేసిమాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండు గల ప్రతిగ్రంథమును రు ౧—౦—౦ వెలకు జందాదారులకుఁ బంపుచుందుము.

౩. గ్రంథములఁ బంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

౪. చందాదారు లగువారు వెనుకటి గ్రంథము లన్నియును గొనవలయునను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములుకూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

౫. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

౬. సంవత్సరము చందా—అనగా ముందు ప్రకటింపబడు ఆఱుపుస్తకములకు ౭-౨-౦ లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజిష్టర్డు పార్సిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లించవలసిన మనియార్డరు కమీషను ౦-౧-౨-౦ లు రిజిష్టరు ఖర్చు ౦-౧-౨-౦ లును రు ౧-౮-౦ లు కూడివచ్చును.

# పెండ్లి దండ

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., బి. యల్.,



సరస్వతీగ్రంథమండలి
రాజమహేంద్రవరము

"హా! అన్నా!" యని శక్తి శరాహతిఁ గువలయమునఁ గూలినపుడు సౌమిత్రి ముఖమండలము పాండురమాయెను. కాని, తనభార్య యప్పుడే సుఖప్రసవమొంది తన శైశవ కూఁతుఁ బ్రసాదించెనని ప్రత్యూషమం దంతఃపురమునుండి వచ్చినవార్త చెవులఁ బడినపుడు దామోదరుని యానన మంతకన్న నెక్కుడు వివర్ణమైపోయెను!

దామోదరుఁ డత్యల్పవేతన మొందుచున్న బ్యాంకి యుద్యోగి. జీతమల్పమే యయినను, అహర్నిశలాతఁడు చేయ వలసినపని యధికముగనేయుండును. అందుచేతనే దామోదరుని శరీరము రేఁబవలులు జట్కాల లాగు నిర్భాగ్యపు జక్కి మాడ్కి శుష్కమై, జీర్ణమై, శీర్ణమైయుండెను. కనులఁ జేరిన జీవములతోఁ జూచుటకు భయముగొల్పు త్వగస్థి మాత్రావశిష్ట సైంధవ రాజంబుల మాడ్కుల చాడ్పున, దామోదరుని దృక్కులు, నిష్కామ నిర్వికార నిర్లిప్త భావోపేతములై యుండెను. భయంకరమైన యాశుభవార్త యంతఃపుర వినిర్గతమై యాతని కర్ణపుటములఁ జొరగనే, చేతఁగల పాలుకాఁగొట్టమట్టులె చలన రహితమైయుండఁ బ్రపితామహార్జితమైన ప్రాత తలగడకు గట్టిగ నానుకొని కూర్చుండి దామోదరుఁ డొకమాఱు "హా! దైవమా!" అని యను

కొనియెను. కాని దీర్ఘమగు నొక వేఁడి నిట్టూర్పు విడుచుటకైన నా బాడబున కపుడు శక్తి చాలకుండెను.

ఆ యాభీల శుభవర్తమానమును గొనివచ్చిన కఠినాత్మురాలు అన్నపూర్ణ. "బాబయ్యా! రా! పాపాయిని చూద్దువు గాని రా!" అని యాబాల మిగుల నానందమునఁ దండ్రి నుద్దేశించి పల్కెను.

తనయ నవలోకించి, దగ్గుత్తిక నడంచుకొని, "అమ్మా! లోపలికిఁబోయి గ్రుక్కెఁడు మంచినీరు దెచ్చిపెట్టుము." అని యాతఁ డనియెను.

అన్నపూర్ణ ప్రాయము రమారమి పది వత్సరములుండును. ఆమె దామోదరుని తృతీయతనూభవ. తోయముఁ గొని తేరఁ గుమారి యరుఁగఁగనే, పురుటింటి వెచ్చంపు విషయము ముందుగ దామోదరుని చిత్తమునకు స్ఫురింప నాతఁడు "హా! దైవమా! ఒక్కసూతికా గృహవ్యయముఁ దలంచినంతనే నా గుండియ లవియుచుండెనే! చేతఁ గాసైనలేదు. ఇపుడు నే నేగంగలో మునుంగుదు" ననుకొనుచు నిట్టూర్చెను. అపుడా నిర్భాగ్య దామోదరుని మస్తిష్కమున నింక నెన్నో తలంపులు ప్రవేశించి కలఁచివేయుచుండెను. గతవత్సరమున ద్వితీయ దుహిత పరిణయార్థము తాఁగొనివచ్చిన యర్థమునకై తన చక్కని రెండంతస్తుల మేడ తనఖాలోఁ బడుటయు, దానివడ్డి శుక్లపక్ష శశాంకునిమాడ్కి దినదిన ప్రవర్ధమానమగు చుండుటయు, రాఁబోవు స్వర్గపూజకుఁ గమల నత్తవారింటి

కుచితరీతిని సారిబెట్టిఁ బంపవలసియుండుటయు నాతఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచుండెను.

ఉదయ మెనిమిది గంటలనుండి రాత్రి యెనిమిదిగంటల దనుక కూర్చున్నను, తారుమారై తోఁచు కచేరీ లెక్కలు సరిపడలేదు. నేడు పగలు రెండు యామముల లోపుగ వానిని సరిచేసి ప్రధానకార్యాలయమునకు బంపవలయును. మలినవస్త్రములను ధరించి కచేరికి రాఁగూడదనియు, యట్లరు దెంచినచో జుల్మాన విధింపఁబడుననియుఁ గచేరి యధికారి గతదినమున హుకుము జారీచేసియుండెను. కాని సుమారు పది దినముల నుండియు చాకలిజాడలేమియుఁ గానం బడ. లేదు. ఇంటఁగల బట్టలలో మూడువంతులు వాని వద్దనే యుండెను. కాని వాఁడు " నీ దిక్కున్నతావునకుఁబోయి చెప్పుకొను"మని, యెందో పలాయనమొనరించిన ట్లిది వఱకే తెలియవచ్చెను. ఇదికూడ స్మృతిని బడినంతనే దామోదరుఁ డిఁకఁ దలగడ కానుకొని కూర్చుండఁజాలక పోయెను. చేతఁగల హుక్కా గొట్టమును విసర్జించి ప్రక్కకొరఁగి "హే! దయామయా! ఈ కలకత్తా మహానగర మునఁ బ్రతిదిన మెంతమందియో పలువిధములైన శకటముల క్రిందఁబడి క్షతగాత్రులై చత్తురు. ఆ నిర్భాగ్యులు నీప్రేమాల నీదార్భాగ్యదామోదరుని కంటె ఘోర తరాపరాధులుగఁ గన్పట్టిరా? దీనావనా! నీకృపచే నే శకటమైన నొకటి నా త్రొమ్మునుండిపోయి, నిముసములో నన్ను నీ సాన్నిధ్యమునఁ

జేర్పరాదా?" అని యాతఁడు పరివరి విధములఁ బరిదేవన మొనరింపఁ దొడఁగెను.

అన్నపూర్ణ—(నీరముఁగొనివచ్చి)—బాబయ్యా! ఇదిగో మంచినీళ్లు! లే!

దామోద—(కలశముసందుకొని, అందలి సలిలమునొక్క గ్రుక్కలోఁ ద్రాగి)—అమ్మయ్యా!—అమ్మా! ఇఁక చెంబును లోనికిఁ గొనిపొమ్మ.

తనయ నిష్క్రమింపఁగనే దామోదరుఁడు మరల పరుండెను.

ఇంతలో లలిత అచ్చోటికి కేతెంచి "మామయ్యా! తేనీరు గొనివచ్చితిని. లెమ్మ" అనెను. తేనీరని వినఁగనే దామోదరుని వివర్ణ ముఖ మొకించుక వికాశమొందెను. చివాలున లేచి కూర్చుండి లలిత ముఖ మువలక్షింపఁగనే ఆతని హృత్తాపమందు సగ మంత మొందెను.

దామో — అమ్మా! రాత్రియంతయు మేల్కొని యుంటివి కాఁబోలు. ఈలావచ్చి, ఒకమాటు నాయొడిలోఁ గూర్చుండుము తల్లీ!

లజ్జాహాసనము లాననమునఁ దోప లలిత మాతుల దరిఁ జేరి "మామయ్యా! నేను రాత్రి చాలసేపు మేల్కొని యుండలే" దనెను.

జీర్ణుఁడై, శీర్ణుఁడై, గురుదుఃఖ భారగ్రస్తుఁడైన మాతుల హృదయ కుహరాంతరాళగభీరావేదనము నామెకన్న నధిక

ముగ నెఱుంగఁ జాలెడు వారెవరు నీపృథివియందు లేరు.

దామో.—మేల్కొనియుండలేదా? పసిబిడ్డవయ్యు నెంత గుట్టుఁగలిగి మెలంగుచుంటివి తల్లీ! నాయొడిలోనికి వచ్చి కూర్చుండుము.

లలిత యంకతలమున నుపవిష్టకాఁగనే యతఁడామెశిరము మూర్కొని, యంగుళిచే నామె వీసీల కుంతలములను దువ్వుచు, కరుణ్రియంబున "ననుఁ గన్నతల్లి నొక రారాజు కోడలినిగఁ జేయఁగల్గితినా, నా సామర్థ్య మేమో తెల్ల మగు" ననియెను.

లలిత నతముఖయై, తేసీటిని జల్లార్చుచుండఁ బ్రేమ యొల్కు పల్కుల నాతఁ డిట్లనియెను. "అమ్మా! మంద భాగ్యుఁడగు నీమామ యింటికరుదెంచి, దివారాత్రములొకే రీతి గష్టపడుచుంటివి. ఊపిరిఁగొనుటకైనఁ దెఱపి లేదుగదా నీకు తల్లీ!"

"తెఱపిలేని పనియేమున్నది మామయ్యా? ఊరక కూర్చుండక, అంకతీవలెనే నేఁగూడ నొక చిన్నిపనిఁ జక్కఁ బెట్టుచుందును."

దామో.—(మందహాస మొనరించి, మెల్లగఁ దే నీరు గ్రోలుచు)—అమ్మా! అట్లైన నేఁడు మడిగట్టుకొనువా రెవరు?

లలిత—(ముఖమెత్తి)—ఎవరేమి? మడి నేను కట్టుకొన నా మామయ్యా?

దామో—(అచ్చెరువొంది)— అమ్మా! నీవు వంటఁ జేయు టెఱుంగుదువా?

లలిత—ఎఱుఁగకేమి? వంటఁజేయు విధమంతయు నేను అత్తయ్యకడ నేర్చుకొంటిని.

దామో—(సోనీరుపాత్రను ముఖమునుండితీసి, చేతియం దుంచుకొని)—నిజమేనా?

"నిజమే. అత్తయ్యవండుచు నిది యిట్లని యది యట్లని చెప్పుచుండెడిది. తరువాత అత్తనొకమూలఁ గూర్చుండఁ బెట్టి వంటయంతయు నేనే చేయమొదలిడితిని."

యవనత వదనయై యట్లు తనతో ముచ్చటించు లలిత యాననంబుపైఁ గేలుంచి దామోదరుఁ డతి కారుణ్యమునఁ "అమ్మా! చిరంజీవివి, క" మ్మని యాశీర్వదించెను. ఆతని హృదయమును వేదించు గురుతర దుశ్చింత లలితను జూచు కొనఁగాఁ గొంత దూరీకృతమైపోయెను.

దామోదరుని గేహము వీధిమొగటనే యుండెను. వెచ్చ వెచ్చని తేనీరు మెల్లఁగఁ గ్రోలుచుండ నాతని దృష్టి వాతా యనబాహిరమునఁ బడియెను. అపు డతఁడు "ఎవరు?— చంద్రశేఖరమా యేమి? నాయనా! లోపలికిరమ్ము" అని కేక వైచెను. బలిష్ఠకాయుండగు నొక సుందరుఁడు దామోదరుఁ డున్న యాగారమునఁ బ్రవేశించెను.

యువకుఁడు గదిఁ బ్రవేశింపఁగనే "నాయనా! కూర్చుండు" మని దామోదరుఁడు డగ్గుత్తికతో "నేఁటియుదయము నీపిన్ని

కావించిన చర్య వినియుంటివా? " యని ప్రశ్నించెను.

"చర్యయేమి? ప్రసవించినది—అంతియే కదా! ఆఁడు శిశువు కలిగెనని కాఁబోలు. మీరట్లనుచుంటిరి."

దామో—(నిట్టూర్పు విడచి)— నాయనా! "అంతియే కదా" యని యొకమాటలోఁ దేల్చితివి. నీ పిన్ని కావించిన ఆపనిలో నెంత పుట్టిములకయున్నదో యనుభవించువాఁడను, నాకుఁ దెలియునుకాని, నీకెట్లు తెలియును?

"చినబాబయ్యా! అట్లనకుఁడు. ఈమాట పిన్ని విన్నయెడల నామె మనసునకుఁ జాలకష్టము తోఁచును. ఆ మాటయటుండ భగవానుఁడనుగ్రహించి, ప్రసాదించిన పాప నల్లారుముద్దుగఁ బెంచుకొను టుచితము కాదా? పుత్రిక యుదయించుట లక్ష్మి యవతరించుట కాదా?"

దామో—(ముహూర్త మాత్రము మౌనమూనియుండి) నాయనా! అనఁగూడదు కాని నావిషయము వేఱుగనుండెను! నాదురదృష్టమేమో కాని పుత్రిక లుదయించుకొలఁది నా నిలయమున లక్ష్మియంతరించి, పెద్దమ్మవారు నన్నావహించుచున్నారు. కడుపునఁ బుట్టిన నిసువు నల్లారుముద్దుగఁ బెంచుటుచితమే. కాని ఆ యుచితకార్యము సేయుటెట్లు? నాయనా! భగవానుఁ డిసుమంతైన న్యాయము సూపుచుండుటలేదు. కటికదరిద్రుఁడనుకదా! నావంటి మందభాగ్యునింట నింతమంది యాడుపిల్ల లెందులకు? ఆ స్త్రీయంతయు నడుగంట, దలఁదాచుకొనుటకై శేషించిన యీకొంప యొక్కటికూడ

నీతండ్రి పేరునఁ దనఖాలోఁబడి యున్నది కాని, నిరాశ్రయుఁడ నగుదునని నేనంతగ విచారించుటలేదు — వేఱొకచింత యందు నేను మునింగియుంటిని—లలిత కుసుమముతో సమ మగు మాలలితకుఁ బిన్ననాఁడే తలిదండ్రులు కఱవైరి. ఈ సుకు మారి యొకరాజసదనమున నుండఁదగినది. ఇట్టి మణిపూసను నే నెవనికరములఁ బెట్టుదునాయని చింతిలుచున్నాను. తేజో ద్యుతుల దిగంతములందుఁ బ్రసరింపఁజేయు దివ్యమణులు రాశీకృతమొనరించి తూచినను, యీకుందనంపు బొమ్మతో సరితూఁగఁజాలవు. కాని, యీపట్టి యట్టి యఘూల్యమైన భాలాశమంతకమని యెవరెఱుంగ నోపుదురు? దారిద్ర్య నిపీడనమున స్రుక్కియున్న నేనీ రతనము నెట్టి యపాత్రున కీయవలసి వచ్చునో కదాయని సదా వందురుచుందును. అట్టి కార్యమే కావింపవలసివచ్చుచో, నా హృదయమున నెట్టి శూలాఘాతమగునో, నీవే చెప్పుము. మా చిట్టితల్లి కిపుడు పదమూఁడు వర్షములు నిండినవి. తగినవరు నన్వేషించుచు మన్న నాచేతఁ గాసైనఁ గాన్పించుటలేదు!

దామోదరుని నయన యుగము బాష్పాక్లిన్నమైపోయెను. చంద్రశేఖర మేమియుఁ బలుకక గూర్చుండెను. దామోద రుఁడు మరల నిట్లు వచింపసాగెను. “నాయనా! నీవెఱిఁగిన వారిలో నీమె కెవ్వరినైన గతిజూపఁ జాలుదువా? ఈ కాల మందుఁగూడఁ గొందఱు యువకు లర్థకాములుకాక, పడు చును చూచుకొని పరిణయ మాచరించుకొందురని వింటిని.

అట్టి సంబంధ మేమైనఁ జూడఁగలిఁగితి వేని, నాయనా! నీ కడుపునఁ బుట్టుదును. ఈ పుణ్యముఁ గట్టుకొనిన చో, నీవు రాజాధి రాజువు కాఁగలవు. నే నిచట నిమ్మాశ్రయించి, మీ నీడఁ గాలముఁ బుచ్చుచుంటిని. నీ జనకుఁడు నన్నన్ని విధములఁ దన కనిష్ఠసోదరునిగఁ బ్రేమించును."

"మంచిది. అట్టి సంబంధ మేమైన దొరకు నేమో చూచెద."

"తండ్రీ! మఱువకుము సుమీ! ఎనిమిదేండ్ల ప్రాయము నుండి లలిత నీకడనే చదువుకొనుచుఁ బ్రాయువతి కావచ్చినది. ఈ ముద్దుపట్టి యెట్టి బుద్ధిమతియో, యెట్టి ప్రశాంత స్వభావయో, యెట్టి మంజు భాషిణియో నీకు నేను చెప్పనక్కఱ లేదు. ముక్కుపచ్చ లారని పసికూనయయ్యు, నేఁటినుండియు వంట మొదలగు గృహ కృత్యముల నిర్వర్తించుచు మా చిట్టి పలువురను సత్కరింపఁ జాలును. చిన్నారికిఁగల తెలివి యే పిల్లలకును లేదు. ఘంటాపథముగఁ జెప్పఁగలను. పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్నట్లిప్పుడీ చిన్ని గుజ్జుపై గృహభార మంతయుఁ బడెను."

లలిత కన్నెత్తి మాతుల నొకమాఱు విలోకించి మరల నతవదనయాయెను. ఆపె యోష్ఠాధరములపై మందహాస రేఖ కన్పట్టి ముఖారవిందమును వికసింపజేసెను. కాని యా మందహాస సౌదామిని ముహూర్తములో నదృశ్యమాయెను.

దామో—(నిట్టూర్పువిడి)—చంద్రశేఖరా! మా లలిత జనకుఁడు మాత్ర మల్పముగ నార్జించెననుకొంటివా? కాని

యెంత యర్ధమతనిచేతఁ బడినను, నిముసములో మాయమై పోయెడిది. జాలిగుండెవాఁడగుటచేత నూరుబావ యొకుల కష్ట మును విలోకింపఁ జాలెడువాఁడు కాఁడు. అడిగినవారికి లేదన కుండ, అర్థిజనములపాలిఁటి మందారకుజమై, అర్థమంతయు దానధర్మములకు వెచ్చించుటచేఁ గడుపునఁ బుట్టిన నీయొక్క నిసువుకోసర మాతఁడొక కాసైన మిగల్పఁ జాలకపోయెను.

దామోదరుని పల్కులను వినుచుఁ జంద్రశేఖరము మిన్నకుండెను.

"ఆతఁడేమియు మిగల్పలేదని మాత్రమెట్లందువు? పలు సిలుగులఁ గుములుచున్నట్టి అభాగుల నరిఁజేరి, వారి యార్తిఁ బాపుటకై తాను కట్టుకొనిన పున్నెమును లలితగా మూర్తీ భవింపఁజేసి మాకొసఁగిపోయెను. అట్లు కాకున్న యీ చిట్టి తల్లి యింటికి సాధు సద్గుణ నికురుంబమై మా నిలయమును పావన మొనరించు అన్నపూర్ణ యెట్లు కాఁగలిఁగి యుండును? శేఖరా! ఏమందువు?"

చంద్రశేఖరము మందహాస మొనరించెను.—యేయుత్త రము నొసఁగలేదు.

పక్కఁపడి మాతఁడందుండి వెడలిపోఁబోవ దామోదరుఁడు "నాయనా! యింత వేగిరమే యొందరుగుచుంటి"వనియెను.

"న్యాయవాది నొకనిఁ జూడఁబోవుచుంటిని. ముఖ్యమైన వ్యాజ్యమొకటికలదు."

చంద్రశేఖరములేచి నిలువంబడఁగనే, దామోదరుఁడాతని

నుద్దేశించి "నాయనా! నేఁ జెప్పినదాని మఱువకు సుమీ" యనెను.

స్మితముఖుఁడై తలపంకించి చంద్రశేఖరుఁడుండి నిష్క్రమించెను. యువకుని వయసు రమారమి యిరువదినాలుగు వత్సరములుమాత్రముండును. ఎం. ఏ. పరీక్షయందుఁ గృతార్థుఁడై, న్యాయశాస్త్ర మభ్యసించి గతవత్సరమాది న్యాయస్థానమున అటర్నీ (పక్షవాది) యయ్యెను. ఈతని జనకుఁడు శ్యామసుందరుఁడు. బెల్లము వ్యాపారముచేసి, లక్షలుగడించెను. అతఁడు కతిపయ వర్షములనుండి వాణిజ్యమును గట్టిపెట్టి నిజాలయమునఁ గూర్చుండి వడ్డీవ్యాపారము సాగించుచుండెను. అతని జ్యేష్ఠపుత్రుఁడు అవినాశముకూడ న్యాయవాదియే. చంద్రశేఖరము శ్యామసుందరుని కనిష్ఠతనూభవుఁడు. పరిసర భవనములన్నిఁటికంటె వీరి సౌధ మత్యున్నతమై, శ్యామసుందరుని యుచ్చస్థితి నెల్లఱకుఁ జాటుచుండును. దానియందుఁగల రెండవయంతస్తుతో దామోదరుని మేడడాబా కలిసి యుండుటచే నిరుకుటుంబములు వారికిఁ జాల సౌహార్ద్యముకలదు. ఉభయ భవనముల స్త్రీలా పథమునుండియే రాకపోకలు జరుపుదురు.

౨

శ్యామబజారునందు వసించు నొక యైశ్వర్యవంతుని కుమార్తెను జంద్రశేఖరమునకుఁ గూర్పుటకై చాల దినములనుండి పెండ్లిమాటలు జరగుచుండెను. నేఁడు శ్యామసుందరుని గృహమునకుఁ బెండ్లివారు దయచేంచి, వరునిఁ జూచుకొని, రాఁబోవు మాఖమాసమున నేదేని యొక శుభదినము నిశ్చయింప వేఁడిరి. కాని, చంద్రశేఖరుని జనని యందుల కంగీకరింప లేదు. "చిన్నవాఁడు పోయి, వధువును జూచిన పిదపఁ గల్యాణ తిథి నిశ్చయము చేయవచ్చు" నని వారించెను.

శ్యామసుందరుఁడు లక్ష్మీపూజా దురంధరుఁడు. అహర్నిశము లాతఁడా దేవతాదర్శనమే కోరుచుండును. ధనమును మించిన దైవము లేదని ఆ మహాత్ముని యభిప్రాయము. అందుచే నాతని దృష్టి యశ్రాంత మర్థముమీఁదనే నిబద్ధమై యుండును. తనూభవుని పరిణయవనుయ మెప్పు డాసన్నమగునా యనియు, భాగ్యలక్ష్మి తనయెడ నెపుడు ప్రసన్నమగునా యనియు నాతఁ డువ్విళ్లూరుచుండెను. అందుచే గృహిణి చూపిన యడ్డంకి కాతఁ డప్రసన్నుఁడై "ఇదేమి మాట? పిల్లను పిల్లవాఁడు చూచుకొనకుండనే సంసారము చేయునా? గృహమున కరుదెంచిన పిదప నామె దాఁగియుండునా? చిన్నవాఁ డిపుడే యామెను చూచుకొనవలయునను

సిద్ధాంత మేమి? ఇంక నెంతమాత్రము కాలాతీతము చేయక తిథి నిర్ణయము గావించుకొను టుత్తమము. పుస్తెముడివేయు కాలమునం బిల్లదాని మొగమును పిల్లవాండు చూచినం జాలు" ననియెను.

కాని గృహిణి యందులకియ్యకొనలేదు. అందుచే తాంబూలములు నందుకొన వచ్చిన పెద్దమనుష్యులు తిరిగి పోయిరి. పత్నిపై శ్యామసుందరునకుం బట్టరాని క్రోధము కలిగి రెండుమూడుయాములు తిరిగిన పిదప భోజనము సల్పి, సజ్జశయ్యామందిరమున కరుగక, వడివడిగ వీధిగదిలోని కరిగి, అందు ముసుంగు దన్ని పరుండెను.

చంద్రశేఖర మొకించుక భోగాసక్తుండని చెప్పవచ్చును. విలువగల వస్త్రములనే యాతండు ధరించును. సువాసన తైలములు విరివిగ వాడును. శిరోజములను సవరించుట కాతండెంతేని సమయమును వెచ్చించును. సౌధమునందలి పై యంతస్థున నొక శయనాగారము ప్రత్యేకముగ నాతనికై యేర్పడి యున్నది. ఆ గది బహుభంగుల నలంకరింపంబడి యుండును. అయిదారుదినములు గడచినవెనుక నొకనాం డపరాహ్ణసమయమున, నిజాగారమున, నిలువుటద్దముముందు నిలచి పెండిలి కూంతురును జూచుటకై యరుగం దలంచి చంద్రశేఖరము ముస్తాబగుచుండెను. లలిత యత్తఱి గదిలోం బ్రవేశించెను. క్షణకాల మాతని చర్యం దిలకించుచు నిలచియుండి "ఓహో! పెండ్లివేషము కాంబోలు" నని యామె పలికెను.

చకితుఁడై వెనుదిరిగి చూచి చంద్రశేఖరము "లలితా! ఇపుడు శ్యామబజారుకుఁ బోవలెను. పెండ్లికొమార్తెకు నచ్చునట్లు నన్ను ముస్తాబుచేయుము. చూచెద నీ సామర్థ్యము!" అనెను.

లలిత—(చిఱునవ్వుతో)—నా కిప్పుడు తీరుబడిలేదు. పైకముకొఱకై వచ్చితిని.

పసుపుక్రిందనుండి బేగముఁ దీసి, లలిత దానితో నల్గాఁగఁ దెఱచి, కొన్నిరూకల నందుండి తీసికొనెను. వానిని కొంగున ముడివేసికొనుచు "అవసరమగునపుడెల్ల పైకము తీసికొనుచుంటిని. కాని యీ యప్పు తీరు టెట్లో?" యని మెల్లగఁ దనలోఁ దా ననుకొనియెను.

అందమైన తూలికతో ముంగుఁగులను మహాయత్నమునఁ బైకి విరచుచు "ఎప్పుడో తీరునా? తీరుచునే యుండెనా" యని చంద్రశేఖరుఁ డనియెను. దాని యర్థము లలితకు బోధపడలేదు. ఆతని వింత వేషమును విలోకించుచు నామె యట్లే నిలువంబడి యుండెను.

"చూచుచుంటివేమి? బోధపడలేదు."

లలిత—(తలయూపి)—లేదు.

"ఇంకను యొకించుక పెద్దదానవగుము. తీర్చుటేమో నీకే బోధపడును."

అనంతర మాతఁడు పాదరక్షలు తొడుగుకొని వెలుపలికి వెడలిపోయెను.

శ్యాంబజారునుండి మరలివచ్చి చంద్రశేఖరము రాత్రి నిజ తల్పముపైఁ బరుండి యేదియో యోచించుచుండెను. భువనేశ్వరి తనయుఁ జూడ గదిలోఁ బ్రవేశించెను. తల్లిని కాంచి చంద్రశేఖరము చివాలున లేచి కూర్చుండెను. ప్రక్కలనున్న బల్లపై నుపవిష్టయై భువనేశ్వరి—"నాయనా! పిల్లను చూచి వచ్చితివి కదా. చిన్నదాని రూపురేఖ లెట్లున్నవి" అని ప్రశ్నించెను.

చంద్ర—(జననిముఖ మువలక్షించి, మందహాస మొనరించి)—ఎట్లుండవలెనో యట్లేయున్నది—చిన్నది యందకత్తెయే!

భువనేశ్వరివయసు రమారమి యేబదివర్షము లుండును. కాని, యామె యవయవము లింకను యౌవనద్యుతుల నీనుచుండుటచే, నా సుందరిప్రాయము ముప్పది, ముప్పదైదేండ్ల కన్న నెక్కుడువలె దోఁచదు. ఆ కాంత సుందరాకారము కన్నఁ దదభ్యంతరమునఁ గల మాతృహృదయ మధిక శోభలమై యుండెను. భువనేశ్వరి పుట్టినిల్లు కలకత్తాపరిసరమునఁ గల యొక గ్రామము. పల్లెయందుఁబుట్టి, పల్లెయందే యామె పెరిగెను. కాని, కాపురమున కరుదెంచినదాదిగ గలకత్తా యందు వసించుచున్నను, నాగరికవాస నామెకుఁ గ్రొత్తయై ఘ్రాణింపలేదు. చంచలసజీవ నాగరికాచారము లామె కలవడి నను, జన్మభూమియొక్క నిబిడనిస్తబ్ధతనిర్మలస్వభావము నామె విస్మరింపలేదు. ప్రశాంతచిత్తయైన మాత చంద్రశేఖరుని

కెంతగా గర్వింపదగిన వస్తువో భువనేశ్వరియైన యెఱుంగదు. జగదీశ్వరుండు చంద్రశేఖరునకు సకల సౌభాగ్యములఁ బ్రసాదించెను. అనన్యసాధారణమైన యైశ్వర్య స్వాస్థ్యసౌందర్య బుద్ధు లన్నిటికంటె నీశ్వరకటాక్షమునఁ దాను భువనేశ్వరి గర్భమునం దుద్భవించు బిడ్డడు భాగ్యమని యాతఁడు యోజించుచుండును.

భువ—అందకత్తెయే యని యూరకుంటి వేల ?

చంద్ర—(మందహాస మొనరించి, నతముఖుఁడై) నీ వడిగిన ప్రశ్న కుత్తర మొసఁగితినికానా ?

భువ—(స్మితముఖియై) అందకత్తెయని చెప్పిన జాలునా ? చిన్నదాని మేనిఛాయ యెట్లుండును ? ఎవరి పోలిక ? మన లలితవలె నుండునా ?

చంద్ర—లలితకంటె మఱింత యందముగనే యుండును.

"ముఖము, నేత్రములు యెట్లుండును ?"

"ముఖము సరోజమువలెను, నేత్రములు చక్రముల చాడ్పున నుండును."

"అట్టైన సంబంధము స్థిరపఱచుఁడని నీ జనకునకు! జెప్పుదునా ?"

చంద్రశేఖరుఁడు మిన్నకుండును.

భువ—(క్షణకాలము తనూభవుఁ దేఱిచూచి) నాయనా పిల్లదానికి చదువుసంధ్య లేమైన నబ్బెనా ? సంగీతజ్ఞాన మేమైన నుండెనా ?

చంద్ర—అమ్మా ! ఆ విషయమునఁ బ్రశ్నింప మఱచి తిని.

భువ—(అబ్బురమున)—మఱచుటేమి ? ఈ కాలములో ముఖ్యముగఁ గావలసినవి చదువు, రాగజ్ఞానమే కావా ?

చంద్ర—ఏమోనమ్మా ! నా కావిషయము మనసునకు స్ఫురింపనైనలేదు.

భువ—(కొండొకసేపు) తనయుని ముఖలక్షణ ముప లక్షించి, యబ్బురమున)—నాయనా ! ఈ సంబంధము నీ కిష్టములేదా యేమి ?

చంద్రశేఖర మేమో యుత్తర మొసఁగ, గమకింప నింతలో లలిత యాగదిలోఁ బ్రవేశించెను. అందుచే నాతఁ డేమియుఁ జెప్పక యూరకుండెను. లలిత యల్లన వచ్చి భువ నేశ్వరివెనుక నిలువంబడెను. చిట్టిని ముందుకుఁ దీసికొని, ఆయమ "అమ్మా! ఏమి కావలెను ?" అని ప్రశ్నించెను.

"ఏమియు అక్కఱలేదు" అని లలిత మెల్లఁగఁ బల్కెను.

చిన్ననాటనుండి భువనేశ్వరికడ లలితకుఁ జాల చనువు. తన తల్లి యెట్లుండెడిదో, ఆమె యెఱుంగదు. కాని వరుస వావులు కొంతటికి వాడుకపదములు మాత్రమే యైయుండు నని లలిత యెఱుంగదు. ఆమె చిన్నియెద సదా యనురాగ రసముతో దొలుకాడుచుండును.

మేనత్తకడకంటె భువనేశ్వరియొద్ద నామెకుఁ జనువెక్కువ. లలిత యామెను బ్రారంభమున "అమ్మా!" యని పిలుచు

చుండెడిది. కాని, యామె మేనత్త "అక్కా" యని తన్నుఁ బిల్చుచుండు కతనఁ దానుకూడ యామె కత్త యగుదునని యొకనాఁడు భువనేశ్వరి లలిత కెఱింగించెను. అప్పటినుండియు లలిత యామెను "అమ్మా!"యని పిలుచుట మాని, "అత్తా" యని పిలువఁదొడఁగెను.

భువ—(లలిత ననురాగపురస్సరముగఁ గవుంగిలించుకొని) ఏమియు నక్కఱలేదా తల్లీ! అస్వైన నన్నొకమాఱు చూచి పోవుటకై వచ్చితివా ?

లలిత యేమియు నుత్తర మొసఁగలేదు.

చంద్ర—అవును. చూచుటకే వచ్చియుండును. కాని, యిఁక మడి యెప్పుడు కట్టుకొనును ?

భువ—నాయనా! మడి చిన్నారి కట్టుకొను టేల ?.

చంద్ర—అమ్మా! వారింటిలో నిపుడు వంటఁ జేయుచున్న దెవరు ? లలితయే వంట మొకలగువానిని నిర్వర్తించుచుండె నని మొన్న దాని మేనమామ చెప్పెను.

భువ—(నవ్వి) ఆతఁడు చెప్పుట కేమిలే! పరిహాసమున కట్లనియుండును. నాయనా! పిల్ల దానిపైఁ బనిఁ బడవైచి యూరకుండు నను కొంటివా ? కాని మన యింటిలోని పని యంతయు, పాపము పెద్దకోడలి తలపైఁ బడినది—ఓపలేని మనిషికదా! కష్టపడుచుండు టెట్లు చూడఁగలను? పార్వతి పురుటినీరుఁ బోసుకొనువఱకు నూటఁ దక్కించుకొమ్మని పొరుగింటి పేరమ్మ పెద్దమ్మను బ్రతిమాలి, నేను బాలింత

రాలినిఁ గనిపెట్టుకునియుండి, ఒకపూటయైన మన యింటిలో మడి గట్టుకొందును. నాయనా! పని వచ్చినపుడు గనుపు కొనవలెనుగదా!

కష్టసమయమందు దామోదరుని కుటుంబమునకు జనని సాయపడుచుండెనని గ్రహించి, చంద్రశేఖర మొక సంతృప్తి సూచకనిశ్వాసము విడెను.

మాసముదినములు గడచిపోయెను. సంధ్యానంతర మున నొకనాఁడు చంద్రశేఖరము నిజాగారమున నొక పడక కుర్చీపైఁ బరుండి, యొక యాంగ్లనవలను చదువుచుండెను. నిబిష్టచిత్తుఁడై, యాతఁడు పుస్తకపఠనము సల్పుచుండ, లలిత ఆ గదిలోఁ బ్రవేశించి, తల్పముక్రిందనున్న తాళముచెవిఁ దీసికొని, అల్మారు దెఱచి, అందుండి పైకముఁ గొనియెను. పొత్తమునుండి ముఖముఁ ద్రిప్పక చంద్రశేఖరము "ఎవరది?" యనెను.

"బావా! నేను. రూపాయలకై వచ్చితిని."

"నీవా?" యని చంద్రశేఖరము చదువసాగెను.

పైకమును జేలాంచలికిఁ గట్టి యామె బావపొంత నిలువం బడెను. నేఁడు లలిత బాగుగ ముస్తాబై వచ్చెను. తా నెట్లలంకృత యాయెనో, బావ పరికింపవలె నని యామె యా కాంక్షించుచుండెను. ఎట్టులయిన నాతఁడొకమాఱు కన్నెత్తి చూచునని యాశపడి పాపము లలిత యచ్చో జాలసేపట్లే నిలచియుండెను. కాని, యాతఁడు ప్రక్కకుఁ జూడనేలేదు.

పలుకరించి చూడ నిశ్చయించి లలిత "బావా! పది రూపాయలను తీసికొంటి" ననియెను.

"మంచి" దనెను కాని యా చదువరి యొకమాత్రమైనఁ గన్నెత్తి లలితను జూడలేదు.

పాప మింక నామె కే వెరవు తోఁచలేదు. అయినను నిరాశ చేసికొనక, బావ పార్శ్వ పరిసరమున నిలచియుండి, యామె కాలయాపనముఁ గావింపసాగెను. ఎట్టికతినుఁడో కాని చంద్రశేఖర మప్పుడైన లలితను విలోకింపలేదు. అంతకం తకుఁ జదువుపై నాతనికి దీక్ష యెక్కుడగుటఁ గాంచి, యింక వానిదృష్టి మరల్పఁజాలుట యసంభవమని నిశ్చయించి, యొక మాటు దగ్గి కడపటి యత్న మొనరించి, వితథప్రయత్నయై విన్నఁబోయిన మోముతో లలిత యందుండి నిష్క్రమించెను. కాని పరక్షణమందే యామె మగుడి వచ్చి, కవాటోపాంతమున నిలువంబడియెను. లలిత నేఁడు తన వారలఁ గలసి, నాటకముఁ జూడ వెళ్ళఁదలఁచినది.

చంద్రశేఖరుని యనుమతిఁ బడయక, ఆ బాలిక యెందు నరుగదు. తాఁ జేయఁ దలఁచు పను లన్నిఁటి కామె యాతని సమ్మతిఁ బడయవలెనని యెవ్వరు నామెకుఁ దెలిపియుండ లేదు. అయినను నేల నత్తెఱంగున వాని యిష్టానుసారము వర్తింపఁ దలంచునో, యామె కూడ యెఱుంగదు. లలిత సహజస్వభావమే యా యలవాటు నామెకుఁ గఱపెను. ఇతర బాలికల చాడ్పున నామె యిచ్చవచ్చిన తావుల కరిగి, తనకుఁ

దోఁచిన చెయ్దముల నెల్లఁ జేయనొల్లదు. కడు గారాబమునఁ బెంచు నత్తమామ లామె కెందును నభ్యంతరము చెప్పువారు కారు. కాని, యేలకో లలిత బావమాట కడుగుదాట సాహ సించెడిది కాదు.

కవాటపార్శ్వమున నిలచి లలిత "బావా! మే మంద రము నేఁడు నాటకముఁ జూడఁ బోవలె ననుకొంటిమి" యనెను.

ఆమె మృదుస్వరము చంద్రశేఖరుని వీనులఁ జొరలేదు. ఏమియు నుత్తర మొసఁగక, యాతఁడు పత్రము వెనుక బత్రముఁ ద్రిప్పుచు బుస్తకముఁ జదువుచునే యుండెను.

లలిత—(గొంతు సవరించుకొని, యొకించుక బిగ్గఱగ)—బావా! అందఱు నాకొఱకై వేచియుండిరి.

లలిత పల్కు లీమాఱు చెవులఁబడఁ బొత్తమును బ్రక్క నిడి "ఏమి? ఏమనుచుంటివి?" అని చంద్రశేఖరము ప్రశ్నించెను.

లలిత—(ఒకించుక కినిసి)—ఇప్పటికి వినఁబడినది కాఁబోలు. మే మందఱము నాటకములోనికిఁ బోవుద మనుకొను చుంటిమి.

చంద్ర—'మే మందఱ' మనుచుంటివి! ఎవరెవరు?

లలిత—నేను, అన్నపూర్ణ, చారుమతి, దాని తమ్ముఁడు సుబ్బులు, దాని మామ—

చంద్ర—చారుమతి మామ యెవరు?

లలిత—ఆతనిపేరు గిరీశుఁడు. ఐదారుదినములక్రిత మా తఁడు ముంగేరునుండి యరుదెంచెను. కలకత్తాలోనుండి యాతఁడు పట్టపరీక్షకై చదువునఁట—ఆతఁడు చాల మంచి వాఁడు.

చంద్ర—ఇఁకనేమి! సంగతిసందర్భములను కనుఁగొనియే యుంటివి. ఊరు, పేరు, పని, పాట భోగట్టా జేసివైచితివే! మీ యిరువురి కప్పుడే విశేష పరిచయము కలిఁగిన ట్లున్నది. అందువలననే కాఁబోలు నాల్గయిదు దినములనుండి మబ్బులో జంద్రుఁడ వైపోతివి—చతుర్ముఖపురాణకాలక్షేపము బాగు గా జరగుచుండెనా?

చంద్రశేఖరము వాగ్ధోరణి లలిత కొంకించుక వెఱపుఁగొలి పెను. ఆతఁ డిట్టి ప్రశ్న వైచునని యామె తలంపలేదు. ఏమి యుఁ బలుకక లలిత యూరకుండెను.

చంద్ర—ఈమధ్య పేకాట చాల జోరుగ జరుగుచుండెను కాఁబోలునే!

లలిత—(క్షణ మూరకునియుండి కొంత సవరించుకొని పిదప మృదుస్వరమున)—చారుమతి మూలమున

చంద్ర—ఓహో! అదియా హేతువు! చారుమతిమూల మున నాడవలసి వచ్చెనా? అట్లా? (శిర మెత్తి యాపాద మస్తక మామెను విలోకించి)—వేషము వైచుకొని, బాగుగఁ దయారై వేంచేసితివే!—ఇఁక పాపము నిన్నుఁ జిన్నఁబుచ్చ నెందులకు? దయచేయుము.

లలిత కదలలేదు. అందే నిరుత్తరయై, నిలువంబడి యుండెను.

చారుమతి యిల్లు లలితా చంద్రశేఖరుల గేహముల దాపుననే యుండెను. ఆటపాటలందామె యెప్పుడును లలితతోఁ గలియుచుండును. ఇంచుమించు నిరువురు సమవయస్కలే. అందుచే వారుభయులకుఁ జాల చెలిమి కలిఁగెను. ఆమె బ్రహ్మసమాజమువారింట జన్మించెను. గిరీశునిఁ దక్క చంద్రశేఖరము చారుమతి చుట్టముల నందఱి నెఱుఁగును. ఆఱేడు వత్సరములకు మున్నొకమారు గిరీశ మెందులకో కలకత్తా యరుదెంచి, కతిపయదినము లుండి మరలిపోయెను. ఇంతదనుక నతఁడు బాంకీపురమునఁ జదువుచుండువాఁడు. కలకత్తా యరుదెంచుట కాతని కెట్టి యావశ్యకము లేకపోయెను. అందుచే జంద్రశేఖర మాతని నెఱుంగడు.

కవాటప్రాంతమున నతవదనయై లలిత యింకను నిలువంబడియుంటఁగాంచి, "ఊరక నిలువంబడినఁ బ్రయోజనమేమి? ఇఁకఁ గాలహరణ మాచరింపకపో"మ్మని, యాతఁడు మరల బుస్తకమును జేతఁబట్టెను.

లలిత—(కతిపయనిముసము లట్లే నిలువంబడియుండి, మెల్లని స్వరమున) పొమ్మందువా?

చంద్ర—పొమ్మని చెప్పియుండలేదా?

చంద్రశేఖరము యుద్దేశమును గ్రహించి, లలిత కింకర్తవ్యవిమూఢయైపోయెను. నాటకములోనికివత్తునని యామె

మాట యిచ్చియుండెను. పోకుండినచో మాట వచ్చును.

నాటకమునకగు వ్యయమును తాను సగమును, చారుమతి మామ తక్కిన సగమును భరించుట కొప్పందము జరిగి యుండెను.

చారుమతి మొదలగువారు వీధియందుఁ దనకై కనిపెట్టు కొనియుండిరి. తన రాక విలంబ మగుకొలఁది వారి యుద్వి గ్నత హెచ్చదొడఁగెను. సత్వరమే రమ్మని వీధియం దుండి చారుమతి సంజ్ఞఁ జేయుచుండెను. కాని లలితకు గాలు సాగుచుండుటలేదు. బావ యనుమతిఁ బడయకుండ జనుట కామెకు సాహసము చిక్కుటలేదు. విషణ్ణవదనయై, శిరము వాంచుకొని, కొంతసే పట్లే నిలచియుండి, "బావా! ఈవేళ కొక్కనాఁటికే!—వెళ్ళమందువా!" యని లలిత యతి దీన ముగ బల్కెను.

పుస్తకము నొకవంక బాఱవైచి, చంద్రశేఖర మాకస్మిక ముగ లేచి కూర్చుండి "లలితా! నన్నిఁక విశేషముగ విసి గింపకుము. పోవలెననియున్నచోఁ బొమ్ము. మంచిచెడ్డ లెఱుఁగుటకు నీకుఁ జాలినంత యీడు వచ్చిన"దనియెను.

లలిత చకితయైపోయెను. బావచీవాట్లామెకుఁ గ్రొత్తలు కావు. వాని కామె యలవాటుపడియేయుండెను. కాని గత రెండుమూడేండ్లలోపున నిట్టి గద్దిం పామెచెవిఁ బడియుండ లేదు.

ఎచ్చోటికైనఁ బోయి వచ్చుటకుఁ జంద్రశేఖరము నేటి

దనుక లలిత కట్టి యాటంకము వెట్టియుండలేదు. ఇప్పుడు కూడ దన్నాతఁ డభ్యంతరపఱచఁడని నమ్మి పాప మామె క్రొత్తపుట్టముల ధరించి, ప్రయాణసంసిద్ధయై వాని మ్రోల కరుదెంచి వితథమనోరథయైపోయెను. కాని, తన యాస యడియాస యాయెననిగాని, తన స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లెననిగాని, యా బాల దూషిల్లుటలేదు. ఆపె యిప్పు డింకను పసిపాపకాదు—ప్రియవతి! తన్నాతఁడు నాటకమున కేల పోవలదని సూచించెనో, దాని కారణము గ్రహించి, లలిత దుస్సహమైన బిడియముచేఁ బీడితయైపోయెను. ఇట్టి లజ్జానుభవము నామె యీవఱలో నెన్నఁ డెఱుఁగదు. అభిమానముచే నామె యక్షిద్వితయ మశ్రుపూర్ణమైపోయెను. మఱి యొదునిముసము లట్లే నిర్వాక్కై నిలువంబడియుండి విన్నఁబోయిన మోముతో నందుండి కదలి, తడఁబడు నడలతో నిజాగారముఁ జొచ్చెను. అందామె తన తల్పముపై మేను జేర్చి యాత్మసంయమ మొనర్చుకొనుచుఁ బరిచారికచే నన్నపూర్ణను బిలిపించెను. అన్నపూర్ణ పరుగునఁ జేరఁ రాగాఁ బరిచారిక లామెచేత నిడి హీనస్వరముతో "అన్నపూర్ణా! నేఁటికి మీారు పొండు. నాకు సుస్తీగా నున్నది. రాలేనని వారితోఁ జెప్పు"మని లలిత వాక్రుచ్చెను.

అన్న—అయ్యో! ఇట్లనుచుంటివేమి? వదినా! ఏమి సుస్తీ చేసినది?

లలిత—వికారముగాను, తలనొప్పిగాను ఉన్నది. కండ్లు

తిరుగుచున్నవి.

లలిత ప్రక్కకొత్తిగిలి పరుండెను.

తదనంతరము చారుమతి పర్యాయపర్యాయ మరుదెంచి, నేటికి మాత్రము రమ్మని చాల నిర్బంధపఱచుచు నామెనుఁ బ్రతిమాలినది. మేనత్తమాట వినునేమో యని యాశపడి పార్వతిచేఁగూడ బహుభంగులఁ జెప్పించెను. కాని లలిత ససేమిరా యనెను. ఎవ్వరు నామెను సమ్మతింపఁ జేయఁజాలకపోయిరి. చేతఁ బది రూకలు పడినందున నన్నపూర్ణ వెలుపలికి జారుటకై తొందరపడుచుండెను. ఈ చిక్కునఁ దమ పోక కేమి యవాంతరము కల్గునో యని యామె సంకోచించుచుండెను. ఇఁక కాలయాపన మొనరించిన రంగము చెడునని గ్రహించి యన్నపూర్ణ చారుమతిని చాటునకుఁ బిలిచి, పైకము నామెకుఁ జూపి, "వదినెకు సుస్తీగా ఉన్నది. నేను బాగుగా ఎఱుఁగుదును. 'రా! రా!' అని దానిని వేచుకొని తినుట యెందుకు? ఇదిగో! నాకు రూపాయలు ఇచ్చివేసినది. వదినె యిఁక వచ్చినను రాకపోయినను ఒకటే. రా! మనము పోవుదము. ఆలస్యము చేసినయెడల మనముకూడ ఆగిపోవలసి వచ్చును. ఆగిపోవుటకు మన కర్మ మేమి కాలినది?" అని వచించి రూకల నొకమాఱు గలగల లాడించెను.

వయసునఁ జిన్నయయ్యు, గడుసుదనమున నన్నపూర్ణ యేదికిని దీసిపోదని గ్రహించి, వల్లెయని చారుమతి యామెను వెంటఁగొని వెలుపలి కరిగెను.

# 3

చారుమతి తల్లికిఁ బేకాటయన్న మిక్కిలి ప్రియము. కాని, యాటయం దెంత మక్కువ కలదో యాడుటం దంత నేర్పు మాత్ర మామెకు లేదు. ఈ లోటుఁ దీర్చుకొనుట కామె లలితసాయము నపేక్షించుచుండును. లలిత యాటయందుఁ గడు నేర్పరి. మనోరమ పినతల్లి కుమారుఁడు వచ్చినదాదిగఁ బ్రతిదిన మపరాహ్ణసమయమున నామె యింటికడఁ జతుర్ముఖపురాణ కాలక్షేపము జరుగుచుండెను. గిరీశుఁడు—పురుషుఁడు—ఆటఁ గడు చమత్కారముగ నాడెడువాఁడు. ఆతనికెదురై యాడుదమన్న లలితచేయి మనోరమ కనివార్యము.

నాటకముఁ జూచివచ్చిన మఱునాఁ డెప్పటియట్ల పేకాటకై లలిత రానందున మనోరమ యామెను కొని రమ్మని తన పరిచారిక యగు సాగరిక నంపెను. లలిత యప్పుడు పురాణ భావనుండి యేవియో కథలను పరివర్తన మొనరించుచు నాటకు రానని సాగరిక నంపివైచెను.

అనంతరము చారుమతి యరుదెంచి, రమ్మని లలితను బహుభంగుల బ్రతిమాలెను. కాని, లలిత యామె వేఁడికోలున కియ్యకొనలేదు. తుదకు మనోరమయే వచ్చి, లలిత కరములనుండి పుస్తకమును బలవంతముగ లాగివైచి, "చాలు!

చాలు! నీ చదు విఁకఁ గట్టిపెట్టుము. పెద్దదాన వైన పిదప వంటపని మగని కప్పగించి, న్యాయాధిపతి యుద్యోగము సలుపుదువు కాఁబోలు. నీకొఱకు నలుగురు పెద్దలు కనిపెట్టు కొనియుండ, నెట్టి పెద్దమనిషివని భీష్మించుకొని కూర్చుంటివి? రా! రా! ఈవేళ గిరీశముచే జాకీసలాముఁ జేయించి తీర వలె" ననియెను.

పాపము లలిత చిక్కులోఁ దగుల్కొనెను. ఇట్టి నక్క చావు ప్రాప్తించునని యామె తలఁపలేదు. అప్పు డామెకు ముందు నూయి వెనుక గోయి యట్లుండెను. లలిత మనో వ్యథను జారుమతీ మనోరమ లెట్లు గ్రహింపఁజాలుదురు? ముందున కీడ్చు మనోరమను విడిపించుకొనఁజాలక "పిన్నీ! నన్ను విడువుము. నేఁటికి నేను రాలేను. రేపు వచ్చెద" నని యామె డగ్గుత్తికతోఁ బల్కెను. కాని మనోరమ యామె దీనోక్తులను పాటింపలేదు—పార్వతిచేఁ గూడఁ జెప్పించి, లలిత నెట్లయిన నేమి తన యింటికి లాగుకొనిపోయెను. అం దుచే నేఁడు కూడ లలిత గిరీశుని కెదుర్పై పేకాడక తప్పినది కాదు. కాని, మన నుంచి, యామె యాడకుండెను—ఒకమా త్రైన నామె కాట గలువలేదు. ఆడినంతసేపును నన్యమనస్క యై యుండి, ప్రొద్దుగ్రుంకకముస్నే లేచిపోయెను. ఆడినంత సేపు గిరీశుని దృష్టి లలిత ముఖముమీఁదనే నిబద్ధమై యుం డుటచే, వాని యాట కూడ నీరుఁ గార్చుచునే యుండెను. లలిత పోవునపుడు మందహాసముతో నాతఁ డామె నుద్దేశించి

"నిన్నరాత్రి పైక మంపితిరి కాని మాతో నాటకమునకు వచ్చితిరికారు. రే పంతఅము కలసి పోవుదము, రం" డనెను.

లలిత—(మృదుస్వరమున)—నాకు సుస్తీగా నున్నది. నే రాజాలను.

గిరీశ—(నవ్వుచు)—ఇపుడు సుస్తీగా లేక కుశలముగనే యున్నారు. తేపు మంచినాటకము జరగును. ఎట్లులైన మిమ్ము మేము పట్టి తీసికొనిపోవుదుము. ఉల్లాసముగఁ గాలము గడుప వలెను కాని, యెన్నఁడింటినే యంటిపెట్టుకుని యుండు టేల? •

"తేపు కూడ వచ్చుటకు నాకు వీ లుండ" దని పల్కి దృతపక్షయై లలిత నిష్క్రమించెను. నేఁ డామె శ్రద్ధాళువయై యూఁడఁజాలకుండుట జంద్రశేఖరునివలని భయమువలననే యని యనరాదు. ఈమువచ్చిన బాలిక యగుటచే మగవానిఁ గూడి ఖేలన మొనరించు టామెకుఁ జాల సిగ్గుగ నుండెను.

భువనేశ్వరి గృహము లలిత కెట్టి పరిచయస్థానమో, మనో రమ్య యిల్లుకూడ నామె కట్టి ప్రదేశమే. మూఁడుప్రదేశములు నామె కొక్కరీతివే. అంతియెకాక చారుమతికిని తనకును కల చెలిమిమూలమున నామెతో నాటలాడుకొనుట కామె తఅచుగ వారి గృహమున జరుగుచుండును. పిన్ననాఁటనుండి యలవాటుపడిన స్థానమగుటచే, తనవారికడవలెనే లలిత చారుమతి చుట్టములయొద్ద కూడఁ జనువుగఁ జరించుచుం డెడిది. అందుచే చారుమతి మామయ్య తన కన్యుఁడు కాడని

తలంచియే, నేఁటివఱకు చాపలమతి చాడ్పునఁ దాను కూడ నాతని పజ్జ నుపవిష్ట యగుట కామె సంశయింపలేదు. అది యొక తప్పుగాఁ దలంపక నిర్మలచిత్తయగు లలిత యంతటి వలెఁ దాఁ గూడ నాతనితోఁ బ్రసంగించెడిది. కాని, నేఁటి యాటసమయమున గిరీశుని ప్రసంగవిధమును, చిఱునగవును, వారచూపులను విలోకించి, తనపై నా యువకునికిఁ బ్రీతి జనించెనని నామె గ్రహించి, మిక్కిలి సిగ్గుపడియెను. కొలఁది మాత్రపు దినముల పరిచయమందే, యతఁడేల యట్టి మక్కువ చూప సాహసించెనోయని యామె మిక్కిలి యక్కజంపడెను. ప్రేమయన నిట్టిదియని లలిత యీవఱలో నెఱుంగదు. పురుషుని మోహపుదృక్కు లిట్టి లజ్జాహేతువు లని యామె యీవఱలో నూహించియైన నుండలేదు.

లలిత మనోరమనిలయమునుండి గిఱ్ఱునఁ దిరిగివచ్చి నిజాలయమున జాగుసేయక, బావగదికిఁ జనెను. శైశవమాదిగా బావఠయాగారమందలి చిన్నిచిన్ని పను లన్నియుఁ లలితయే నిర్వర్తించుచుండెను. పుస్తకము లన్నిఁటి నొక వరుసగఁ జేర్చియుంచుట, మేజాబల్ల నతి శుభ్రముగఁ దుడిచివేయుట, లేఖిని మొదలగు వ్రాతవస్తువుల యథాస్థానములఁ బొందికగ సమకూర్చుట మున్నగుపనుల నామె చేయకున్న నింకఁ జేయువా రెవరును లేరు. మూఁడు దినముల నిర్లక్ష్యమువలన నెక్కడి పను లక్కడ పడియుండెను. బావ కచేరినుండి మరలి రాక మున్నే వాని నన్నిఁటిని జక్కబెట్ట నిశ్చయించి యందులకుఁ

బూనెను.

శైశవమందే తలిదండ్రులు కఱవై పోవుటచే లలిత మేనమామయింటఁ బెరుగుచు, ఛాయచాడ్పునఁ జంద్రశేఖరు వెన్కకు గడు చనువున మెలంగుచు విద్యాబుద్ధుల నాతనికడనే నేర్చెను. లలితాచంద్రశేఖరు లొకరికొక రేభేదము లేక జరించుచున్నందున భువనేశ్వరికూడ లలితను చంద్రశేఖరుని వలెనే చూచుచు నామెకు వలయువాని ననురాగపురస్సరముగ నొసఁగుచుండెను. అందుచే నా యమయే తన యమ్మ యని లలిత భావించుచుఁ గడు ప్రమోదమునఁ గాలముఁ బుచ్చుచుండెను.

లలిత చంద్రశేఖరుని యనురాగపాత్రయని యెల్ల తెలుంగుదురు. కాని, యాయనురాగాంకుర మాతని హృదయక్షేత్రమున మొలక యెత్తి, సౌహార్ద్యతోయమునఁ బెరిగి, యందు బద్ధమూలమై యుండుట నెవ్వరు నూహించలేదు. లలితకుగూడ నీ సంగతి తెలియదు. శైశవమునుండి యొకే విధముగ నా లావణ్యలతిక యాతనికడ ననిర్వచనీయాదరణముఁ బడయుచుండెనేకాని పరబాలికయని యొక్కనాఁడైన భేదభావముఁగాని, యనాదరణముగాని యెఱింగియుండలేదు. వారిరువురి యన్యోన్యతను గ్రహించినదే యయినను, లలిత తన కెన్నఁడైనఁ గోడలు కాఁగలుఁగునని భువనేశ్వరి యెన్నఁడు తలంపలేదు. దామోదరపార్వతులకైన నాసంబంధమైన యాశ్యాశ పొడమలేదు.

పని ముగించి బావ కచేరినుండి రాకమున్నే లలిత యా గదినుండి వెడలిపోవ దలంచెను. కాని, యన్యమనస్కయై గడియారమును గమనింపక జాగుచేసినది. ఆకస్మికముగ వెలుపలినుండి కిఱ్ఱుకిఱ్ఱను పాదరక్షల శబ్దము వినరాఁగా నపుడు శిరము వాంచి, లలిత యొక ప్రక్కగఁ దొలఁగి నిలువంబడెను.

చంద్రశేఖరుడు గదిఁ బ్రవేశించి, "ఓహో! లలితాంబగారు కాఁబోలు—నిన్న తాము తిరిగి యింటికి విజయము చేయుసరి కెంతరాత్రి యైనది? అని యామెను బ్రశ్నించెను.

ఉత్తర మొసఁగక నతముఖియై లలిత నిలువంబడి యుండెను.

చంద్ర—(సమ్ముఖమందలి యామెల కుర్చీపై నొరగి) నోటినుండి మాట వెల్వడుటలేదేల? ఆరాత్రి తా మింటికి వేంచేయుసరి కెంతవేళ యైనది? రెండుగంటలా లేక మూడు గంటలా? లేక రాత్రి యంతయుఁ బురాణకాలక్షేపమందే గడపివైచితివా?

లలిత యట్లే నిరుత్తరయై నిలువంబడియుండెను.

చంద్ర—(విరక్తిభావమున)—ఇఁకఁ గ్రిందికి పో. అత్త పిలుచుచున్నది.

వంటయింటఁ గూర్చుండి భువనేశ్వరి ఫలహారముఁ జేయుచుండెను. లలిత ఆమెకడ కరిగి "ఎందుకు? అత్తా!"యనెను.

"అమ్మా! నిన్ను పిల్వలేదే!" యని భువనేశ్వరి ముఖ

మెత్తి లలితవదన ముపలక్షించి, "అమ్మా! ముఖ మంతయు వెల్లబారిపోయినదేమే? ఏది? దగ్గరకు రా తల్లీ! ఏమియు తినలేదు కాఁబోలునే? చెప్పు తల్లీ!" యనెను.

'లే' దని సూచించుచు లలిత తలయూపెను. "ఇదిగో! ఈ మిఠాయి బావ కిచ్చి చప్పున రా. నీకును పెట్టెదను."

అత్త యొసఁగిన ఫలహారపుపళ్ళెరమును గైకొని, లలిత మరల మేడపై కరిగెను. బావ అప్పుడుకూడ నిమీలిత నేత్రుఁడై కుర్చీలో నొరగియేయుండెను. కచేరీ యుడుపుల నింకను విడిచివేయలేదు. ముఖప్రక్షాళనమైనఁ గావించుకొన లేదు.

బావను సమీపించి లలిత మెల్లని స్వరమున "బావా! మిఠాయి" యనెను.

చంద్రశేఖరము కన్నెత్తి లలితను జూడకయే "దేనిమీ న బెట్టి పొ"మ్మనెను.

కాని, లలిత అట్లు చేయలేదు. పళ్ళెరమును జేతఁ బట్టు కొని యట్లే నిలువంబడియుండెను.

కన్నెత్తి చూడకున్నను, లలితయింకను అందే నిలువం బడి యుండెనని చంద్రశేఖరము గ్రహించెను. రెండుమూఁడు నిముసము లూరకుండి యతఁడు "లలితా! ఎంతసేపు నిలచి యుందువు? నాకింకను ఆలస్యమున్నది. ఫలహార మచటనుంచి క్రిందికిఁ బొమ్మ" అనియెను.

లలిత యొకింతుక కుపితయయ్యెను. కొంతసేపట్లే నిలువం

బడి యుండి కిన్క నడంచుకొని, మృదుస్వరమున నామె "ఆలస్యముండిన నుండనిమ్ము. క్రింద నేఁ జేయవలసిన పను లేమియు లేవు" అనెను.

చంద్ర—(ఉన్మీలితనేత్రుఁడై)—ఓహో! మాట లిపుడు వడిగనే వెల్వడనే! ఈక్రింద పనులేమియు లేకున్న, ఆ రెండవ యింటిలోనైన నుండకపోవునా? అందుఁ గూడ లేనిచో, ఆమూఁడవయింటి యందైన నుండి తీరకుండునా! లలితా! నీవడుగువెట్టని గుమ్మములు లేవుకదా!

"అవు నట్లే యనుకొనుము!" యనుచు లలిత కుపితయై ఫలహారపుపళ్లెమును బల్లపైఁ గుభాలునఁ బడవైచి వడివడిగ వెలుపలికి వెడలిపోయెను.

"సంధ్యానంతరమున నొకమాఱు రా" అని చంద్రశేఖ రము లోపలినుండి కేకవైచెను.

"పైకి క్రిందికి పదేపదే తిరుగుటే నాపనికాదు" అని లలిత మెట్లు దిగిపోయెను.

ఆమె క్రిందికి రాఁగనే "బావకు ఫలహారమిచ్చి వచ్చితివి కాని, తాంబూలమియ్య లేదేమమ్మా?" యని అత్తపల్కెను.

"అత్తా! నాకాఁకలి వేయుచున్నది. నేను మరలఁ బైకిఁ బోలేను. ఎవరిచేతికైన నిచ్చి పంపు"మని లలిత నేలపైఁ జతి కిల పడినది.

కోపముతో ముకుళితముఖసరోజయైన లలితను విలోకించి నవ్వుచు "పోనిమ్ము. నీ వన్నము తిందువుగాని రమ్ము.

తాంబూలము మఱెవరిచేతికైన నిచ్చి పంపుదునులే" యని భువనేశ్వరి వచించెను.

ఇంకేమియుఁ బలుకక లలిత కంచము ముందు గూర్చుండెను.

తాను నాటకముఁ జూడఁబోకున్నను వాడి వాక్యములచే బావ తనమనసు నొవ్వఁజేసి నందులకు లలితకుఁ బట్టరాని యాగ్రహము కలిఁగెను. అకిన్కచే నామె యైదాఱు దినముల వఱకు బావముఖమును జూడలేదు. కాని బావ కచేరికిఁ జనిన తరువాత, మధ్యాహ్నసమయమున నాతని గదిలోని కరిగి, యచటి పనులనన్నిఁటి నెప్పటియట్లుఁ జక్కఁబెట్టుచునే యుండెను. నిజదోషము గుర్తెఱిఁగి లలితకై చంద్రశేఖరము మూఁడునాలుఁగు కబురుల నంపెను. కాని లలిత సత్వరమే బావకడకుఁ బోలేదు.

## ౪

తొంబదేండ్లు గడచిన ముదుసలి బిచ్చకుఁడొకఁడు ముష్టికై యపుడపుడు దామోదరుని నిలయమున కరుదెంచుచుండును. ఆతనిపై లలిత కెంతేని జాలి. బిచ్చమెత్తవచ్చినపుడెల్ల, ఆతని కామె యొక్కొకరూపాయి చొప్పున నొసఁగుచుండును. రూపాయి చేతఁబడఁగానే బిచ్చకుఁడు లలితను వేవిధముల

దీవించి, యెంతో కొనియాడు వాఁడు. నేఁటి ప్రభాతమున నాభిక్షుకుఁ డరుదెంచి, వీధిగుమ్మము పొంతనుండి "అమ్మా! అమ్మా! మాయమ్మ యెక్కడ?" అని కేకవైచెను. వాని పిలుపువిని లలిత నేఁ డోకించుక తొట్రుపడియెను. బావ యిపుడింటిలో నుండెను. పోయి రూపాయి తెచ్చు టెట్లు? ఇటునటు చూచి లలిత మేనత్తకడ కరిగెను. ఆమె యింతకు ముందే పొరుగింటి పెద్దమ్మతో జగడమాడి యేమేమో తిట్టుకొనుచు ముఖము చిట్లించుకొని వంటప్రొయ్యికడఁ గూర్చుండెను. ఆమెను కదుపుట విపాదజనకమని గ్రహించి లలిత మేడపై కెక్కి కిటికీగుండా వీధివైపునకుఁ జూచెను.

"అమ్మా! మా అమ్మా!! ఎక్కడ? నీబిడ్డ వచ్చాడు" అని బిచ్చకాడు మరల కేకవైచెను.

వీధిలో నాడుకొనుచున్న అన్నపూర్ణ పరుగుపరుగున మేడపై కెక్కి, "వదినా! నీకై బిచ్చగాడు గోలపెట్టుచున్నాడు. వినపడుటలేదా?" అనెను.

"అన్నపూర్ణా! కొంచెము నేపుండి నీకు మిఠాయిపెట్టెదను గాని నాకొక చిన్నపని చేసిపెట్టవు?—ఒక్కపరుగులో పోయి, బావనడిగి, ఒకరూపాయి తెచ్చిపెట్టమ్మా!"

"నేను వెళ్లలేను బాబూ! వీధిలో తంగేటిబిళ్ల ఆడుకొనుచున్నాను. వెళ్లిన నాఆట పోదా!"

"అమ్మా! అమ్మా! వెళ్లవే! బ్రతిమాలుకొందును— వెళ్లవు?—వదినెను కానా?"

"వెళ్లిన నాకేమి ( ప్రకాని"

"ఇవ్వకేమి? ఇచ్చెదను."

"ఏమిటి—చెప్పు"

"మిఠాయి పెట్టెదనంటిని కాదు?"

"వెధవమిఠాయి నాకెందు కేమిటి?"

"ఇంకేమి కావలెను?"

"మంచిపంచదార చిలకలు"

"సరే! అవే యిచ్చెదను. పరుగున పోయి తెచ్చిపెట్టు"

ఇకేమియుఁ బలుకక అన్నపూర్ణ పరుగునఁ బోయి కొంచెముసేపైన పిదప మరల వడివడిగ వచ్చి, లలిత చేతిలో రూక నిడి "ఇదిగో!—నాకు చిలక లివ్వకపోయిన నీపని చెప్పెదను" యనెను.

"సరే కాని—అయితే బావ యేమన్నాడు?"

"ఏమియు అనలేదు. వదినెకు రూపాయి కావాలెనట అన్నయ! అన్నాను. (కోటుజేబులో ఉన్నది తీసికొను మన్నాడు. తీసికొని వచ్చితిని—వదెనా! జేబునిండను రూప్తాయిలే! అవన్నియు అన్నయ్య కెక్కడివి?"

"ఎక్కడో కన్నము వేసినాడు బావ. ఇంక ఏమైనా అన్నాడా?"

"ఇంకేమి అనలేదు.—సరే కాని చిలకలు తెచ్చి యియ్యవలెను సుమీ!" అని అన్నపూర్ణ పాడుకొనుచు, గంతులు వైచుచు, ఆడుకొనుటకై, వీథిలోనికిఁ బోయెను.

గూపాయి యొసఁగి లలిత బిక్షుకుని సాగనంపెను. కాని యెప్పటివలె నిలచి ముసలివాని దీవనపాట నామె వినలేదు.

పేకాట జరుగుచునే యుండెను. నేఁటి మధ్యాహ్నము లలిత యచ్చోటి కరుగలేదు. తల నొప్పిగ నుండెనని పరుండి యుండెను. నిజముగ లలిత చిత్తమంతయు నేఁడు కలఁగి యుండెను. సాయంకాల మామె యన్నపూర్ణను పిలచి "అన్నమ్మా! పాఠము చెప్పించుకొనుటకు నీవు బావదగ్గఱకు వెళ్లుట లేదు?" యని యామెను ప్రశ్నించెను.

"వెళ్ల కేమి? వెళ్లుచునే యున్నాను. నీవలె ననుకున్నావు కాబోలును."

"బావ నామాట యేమైన ననుచున్నాడా?"

లేదు—అబ్బే! కాదు కాదు—ఇపుడు జ్ఞాపకము వచ్చినది. మొన్న అన్నాడు—"రోజు మధ్యాహ్నము పేకాడుటకు వదినె పిన్నిగారింటికి వెళ్లుచున్నదా అని అడిగినాడు."

లలిత—(ఉద్విగ్నయై)—అపుడు నీ వేమన్నావు? ప్రతి రోజును మధ్యాహ్నము రెండు మెతుకులు గొంతుకులో పడటమే తడువుగా నీవు పిన్నిగారింటికి వెళ్లెదవని చెప్పివేసితిని. ఎవరెవరు ఆడెదరని అన్నయ్య అడిగినాఁడు. వదినె, పిన్ని, అక్కయ్య, గిరీశంమామయ్య కలసి ఆడుదు రన్నాను. అయిన వదినా! నువ్వు బాగా ఆడుదువా? లేక గిరీశంమామయ్య బాగుగా ఆడునా? నీవే బాగుగా ఆడుదువని ఎన్నిసార్లో నీవు మామయ్యచేత జాకీసలాము చేయించితివని పిన్ని చెప్పి

నది. నిజమేనా ?—

అన్నపూర్ణ ప్రశ్న కేమియు నుత్తర మొసంగక లలిత మొగముం జిట్లించుకొని మిగుల కోపముతో నిట్లు వాక్రుచ్చెను. "నీవా కథంతయు ఎందుకు ఏకరుపెట్టితివి ? నీకు అక్కఱలేని గొడవ లేదు. దూదుంపుల్లవలె ప్రతిదానిలో తయారగుదువు. మహా ఆరిందావు—బావదగ్గఱ ఆవాగుడంతయు పెద్దపేరక్కవలె ఎందుకు వాగితివి? ఇంక నెప్పుడైన నీకు నే నేమైన పెట్టిన, నా పేరు మాఱుపేరు పెట్టుము."

పాప మన్నపూర్ణ నిర్ఘాంతపడిపోయెను. ముఖము వాచునట్లు వదినె యిట్లేల దులిపివైచెనో యామె గ్రహింపఁజాలదాయెను. బిక్కమొగముతో నా బాల యావలికి వెడలిపోయెను.

లలిత వచ్చుట మానినందున రెండుదినములనుండి పేకాట జరగుచుండుటలేదు. లలితపై గిరీశునకు మిక్కిలి మక్కువ యుదయించెనని మొదటినుండియు మనోరమ కనుమానము తట్టెను. ఆమె సందియము నేఁడు దృఢమైపోయెను.

ఈ రెండు దినములు గిరీశుఁ డన్యమనస్కుఁడై, నిరుత్సాహుఁడై యుండెను. సాయంకాలము షికారునకైన నాతఁడు వెలుపలికిఁ బోవుట మానుకొనెను. గడియగడియకు మేడ మీఁదినుండి క్రిందికిని, క్రిందినుండి మేడమీఁదికిని, కాలుగాలిన పిల్లివలెఁ దిరుగసాగెను. ప్రతి గదియందు బచారుచేయు తమ్ముని మనోవికారమును మనోరమ గ్రహించెను.

తిరిగితిరిగి వేసారి గిరీశమామెకడ కరిగి "అక్కా! ఈవేళ గూడ ఆట జరుగదా?" యని మిగుల నాతురమునఁ బ్రశ్నించెను.

"ఏట్లు జరుగునో చెప్పుము. నలుగురేరి? నీకంతగా నాడ వలయునని యున్నయెడల మనము ముప్పురము ఓకులవేల మాడుకొందము రమ్ము."

"ఓకులవేలము—అయిదు మూఁడు రెండుపట్లు యేమి బాగుండును? ఆయింటివారిపిల్లను రమ్మని కబురంపరాదా?"

"ఎవరిని?—లలితనా?"

"అవును"

"అదిరాదు"

"ఎందుకురాదు? ఆపిల్లయొక్క పెద్దవారు పోవలదని నిషేధించిరా యేమి?"

"లలిత అత్త మామ లట్టివారుకారు. ఆమె తనంతకు తానే రాఁదలఁపక రాలేదు."

విషణ్ణవదనుఁడై యున్న గిరీశ మాకస్మికముగఁ బ్రఫుల్ల ముఖుడాయెను. "అట్లైన నీవొకమాఱుపోయి పిలిచిన నామె రాకమానదు." అని మాటజారవిడచి, యాతఁడు బిడియపడి పోయెను.

మందస్మిత వదనాంబుజయై మనోరమ, "మంచిదట్లే లలితను పిలుచుకొనివత్తు"ననెను. ఆమెవెంటనే పార్వతినిల యమునకరిగి కొంతసేపటిలో లలితను బలవంతముగ లాగు

కొనివచ్చి, ఆటలో గూర్చుండ బెట్టెను.

రెండుదినములనుండి ఆట జరుగుచుండుటలేదు. నేఁడు లలిత కత్యల్పకాలములోనే యాటకలసెను. ప్రతి యాట యందు లలితా మనోరమలే గెలుపొందసాగిరి.

ఒకటి రెండుగంటలు గడచినపిదప, అన్నపూర్ణ పరుగున నరుదెంచి "వదినా! వదినా! అన్నయ్య పిలుచుచున్నాఁడు—త్వరగా" అని పల్కెను.

లలిత ముఖము పాండురమైపోయెను. పేకాటఁజాలించి "బావ కచేరికిఁ బోవలేదా?" యని యుద్విగ్నయై ప్రశ్నించెను.

"ఏమో! నాకదంతయు తెలియదు. వెళ్లివచ్చినాడేమో? రమ్మనమనెను. కనుక చెప్పినాను. అని పలికి పాట పాడుకొనుచు అన్నపూర్ణ పరుగున వెడలిపోయెను.

చేతఁ గలపేకముక్కల నొకవంక బాఱవైచి, మనోరమ నుపలక్షించి కుంచిత భావమున లలిత "నేనిఁకఁ బోయెద"నని లేచెను.

మనోరమ—(లలితకరములఁ బట్టుకొని)—అప్పుడే పోవు టేల? ఇంతలో మించిపోయినదేమి? మఱిరెండు ఆటలు ఆడి వెళ్లుము.

లలిత—(చేతులు విదల్చుకొని)—అత్తా! అట్లనకుము. ఇంకను ఆలస్యముచేసినయెడల బావకుఁ జాల కోపమువచ్చును.

లలిత ద్రుతగతి నిష్క్రమింపఁగనే "అక్కా! లలిత బావ

యెవరు?" అని గిరీశము మనోరమను ప్రశ్నించెను.

"అదిగో! ఆ పెద్దమేడగలవారి చిన్నవాఁడు"

"ఓ! అట్లా? లలిత మేనమామ కొయింటి యాతఁడా పుత్రుడుకాఁబోలు"

మనోరమ (మందస్మితముఖమండలయై)— ఓ! అప్పుఁడు కాకేమి! వెఱ్ఱిదామోదరుని కొంప తనవశము చేసికొనివలె నని యాతఁడు పన్నాగముఁ బన్నుచుండెను.

ఆశ్చర్యాన్వితుడై గిరీశము మనోరమ పల్కులు వినదొడఁగెను.

"చేత డబ్బులేనందునఁ దన రెండవ కుమార్తె పెండ్లి యెట్లగునా యని దామోదరుఁడు విచారించుచుండఁ బర మాప్తుఁడట్లు శ్యామసుందరుఁడు పెద్ద వడ్డిమీఁద నాతనికి ఋణ మొసఁగి వాని నివేశన స్థలము నంతయు తనఖా వ్రాయించుకొనెను. ఆఋణము తీర్చుటకు దామోదరుని కీజన్మమున సాధ్యముకాదు. తుదకాయిల్లు శ్యామసుంద రుని పరమగునని దేవుఁడే చెప్పెను. ఆదౌర్భాగ్యుని కొంపఁ గూల్చి రెండవకుమారునికొఱకై పెద్దమేడఁ గట్టింపవలెనని అతఁడు యెత్తువేయుచుండెను. కొడుకు లిరువురకుఁ జెరియొక మేడయుండవలెనని యాతని యభిలాష — తక్కువ యభిలాష కాదు."

మనోరమ నుడువులు విని గిరీశుఁ డెంతయో నొచ్చుకొనుచు "అక్కా! దామోదరుని కింకను ఆడుపిల్లలున్నారు

కదా. పాపమా నిరుపేద వారందఱి కెట్లు ముడి వెట్ట
గలఁడు!" అని యాతఁ డామెనడిగెను.

"కడుపునఁ బుట్టిన బిడ్డలమాట యటుండ, మేనకోడలొక
ర్తుక ఆతనితలపై నున్నది. లలితకుఁ దలిదండ్రులులేరు. దాని
భారముగూడ నిరుపేదయగు దామోదరునిపైఁబడెను. పిల్లకు
ఈడు వచ్చెను. ఈ యేడాదిలోపుగఁ బెండ్లిచేయకతప్పదు.
ఆతని సంఘీయులలో నెవ్వరును రవంత సాయము సలుపు
వారులేరు—వెలి వేయుటకందఱు సిద్ధముగనే యున్నారు.
నాయనా? మనసమాజమే దొడ్డది—మనలో నట్టి దుర్నయ
ములులేవు.

గిరీశుఁ డాదరముతో వినుచుండ నామె మఱియు నిట్ల
నెను. "ఆనాఁడు మేనకోడలిమాటఁ జెప్పుచునే నాకడ నా
యమాయకుఁడు వెక్కి వెక్కి యేడ్చెను. ఈడు వచ్చిన పిల్ల
నింక నెంతకాల ముంచననియు, నేమిచేయుటకును పాలు
పోవుట లేదనియు, బిడ్డలకు మనువులు తేలేసి తనవంటి యథ
ముఁడు చానక బ్రదుకుటెందులకనియుఁ బాప మాతఁడు పరి
పరివిధముల వాపోయెను. లలిత మూలముగానైన బెంగ
వలన నా ముదుసలి కడుపునిండఁగూడైనఁ దినుటలేదు.
ఒక్క రీతిగఁ గుళ్ళిపోవుచున్నాఁడు. నాయనా! గిరీశం! ముంగే
రులో నీవెఱిఁగిన వారిలోఁ బిల్లను మాత్రము చూచుకుని,
ముడి వెట్టుకొన సమ్మతించు పుణ్యాత్ముఁ డెవఁడైన నుండు
నేమో చూడుము. లలితవంటి మణిపూస యెందును దొర

కదు.”

గిరీశం—(విషణ్ణ భావమున మృదు హాసనము సలిపి)—అక్కా! ఈదినములలో సొమ్ము నెరఁజూపినఁగాని ముందునకు వచ్చువా రెవరు? నే నెఱిగినవారు చాలమందియే యున్నారు. కాని, కట్నపేక్షలేని వాఁ డెవఁడు నాకు గన్పించుటలేదు. కాని, వలయుచో ద్రవ్యమూలమున దామోదరునకు నేఁగొంత సహాయముచేయ యత్నింతును.

గిరీశుని జనకుఁడు వైద్యవృత్తితో జాలధన మార్జించి పేరు మోసిన భూస్వాములలో నొకడయ్యెను. శ్రీధరుఁడు పరమ పదించినందున, నాయాస్తి కంతయు నేకాత్మజుఁడైన గిరీశుఁ డధినాథుఁడు.

మనో—దామోదరునకు నీవు ఋణ మొసఁగెదవా!

గిరీశు—ఋణమేమి అక్కా! అతఁ డీయఁగలుగుచో దీసి కొనిన మొత్తమును తిరిగి యీయవచ్చును. లేకున్న మాన వచ్చును. పాపము నిరుపేదకదా!

మనో—(విస్మితయై) ఆతనికి సొమ్మొసఁగిన నీ కేమికూడి వచ్చును? దామోదరుఁడు మనకు దగ్గఱచుట్టము కాదుకదా! మన సంఘములోనివాఁడుకూడ గాదు.—ఇట్టివారైన నేరికైన ధనము ధారవోయుదురా?

సోదరి పల్కులనాలించి, గిరీశము స్మితముఖుఁ డాయెను.

మనో—నవ్వ నెందులకు? మనమే ఊరక డబ్బిచ్చి యూరకొందుమా? మన చుట్టమా పక్కమా?

గిరీశు—మన చుట్టము, పక్కము కాకున్నను, సమాజము నకుఁ జెందినవాఁడు కాకున్నను, అతఁడు మనవంటి మని షియే కదా! అంతియేగాక, అతఁడు మన దేశీయుఁడు. ఆతని నిరుపేదగను, నన్నైశ్వర్యవంతునిగను భగవానుఁడు పుట్టించెను. తా నిష్టపడుచో, వలయు విత్త మొసఁగుటకు నేను సిద్ధముగానుంటినని నీ వొకమా ఱాతనితోఁ జెప్పి చూడుము లలిత యతనికిని పరాయిదే—మనలకుఁ బరాయిదే! ఆమె వివాహమున కగు వ్యయమునంతయు నేనే వెచ్చించినందున, దప్పేమి?

గిరీశుని పల్కుల నాలించి మనోరమ ప్రహృష్టాంతరంగ కాలేదు. దామోదరున కాతఁడు ధన మొసఁగునెడల, నామె కెట్టి నష్టము కలుగదు—కలుగదని యామె యెఱుఁగక పోలేదు. కాని పరిణయమున కగు పెద్ద మొత్తము నొకఁడు మఱొక్కని కుచితముగ నొసఁగుటఁ జాలమంది స్త్రీలు చూచి సహింపఁజాలరు. సుశీలయగు మనోరమకుఁగూడ నట్టి దుర్బలత యొకించుక కలదు.

చారుమతి యింతదనుక వారి పల్కులను వినుచుండెను. మేనమామ మాటల కామె మిగుల సంతోషించి యొక్క గంతున ముందున కుఱికి “మామా! వదినెపెళ్లి నీవు చేయింపుము. ఈమాట పెద్దమ్మతో చెప్పి వచ్చెదను” అని పర్వెడఁ బోయెను.

మనో—(మిగుల గోపించి)—ఛీ! పెద్దమ్మకానా! ఆగుము.

పెద్దపేరంటాలువలె అన్నింటికి నీవే సిద్ధమగుదువు. పెళ్ళి పేరంటకములమాటలతో నీ కేమిపని ? చెప్పవలసియున్న, అ దేమో నేనే చెప్పెదను. నాయనా! గిరీశమా! నోటినుండి మాట బయల్పడుట తడవు—పరుగు !

గిరీశం—దాని కేమి తెలియునులే, అక్కా ! ఈ విషయము మఱచిపోక దామోదరునితోఁ జెప్పుము. మొన్న సాయంకాలము త్రోవలో నాకును అతనికిని కొంత పరిచయము కలిఁగెను. మాటలధోరణిఁ బట్టిచూడ అతడు చాల పెద్దమనిషివలె నాకుఁ దోఁచెను. నీ వేమందువు ?

మనో—అవును నాయనా ! నీ వనినది నిజమే. దామోదరుఁడు సరళస్వభావుఁడని యందఱ అనుకొందురు. సతీపతులిరువు రొకేరీతివారు. కల్మష మేమో యెఱుఁగరు. అట్టియుమాయికులు పాప మిల్లువాకిలి గోల్పోయి దిక్కుమాలిన పక్షులవలె యెచటికైన లేచిపోవలసివచ్చునేమో యని దుఃఖపడుచుందును. పసిబాలయగు లలితయైన స్వతంత్రముగఁ దిరుగుటకు వలనుపడదు. బావ పిలుచుచుండెనని విని, నీవు చూచుచుండఁగనే కదా యా బిడ్డ పరుగుపరుగున వెడలిపోయెను. దామోదరుని కుటుంబములోనివారందఱు. శ్యామసుందరునింట విక్రీతులై పోయిరని చెప్పవచ్చును.

గిరీ—నేఁ జెప్పినదాని నడిగి చూతువా ?

మనో—అట్లే యడుగుదును. ఈ యుపకారము జేయఁగలిఁగితివేని, నాయనా! జీవన్మృతులైయున్న నిరుపేదకుఁ

ప్రాణదానముఁ జేసినవాఁడ వగుదువు. (ఒకించుక నవ్వి) అయ్యిన తమ్ముఁడూ! లలిత పెండ్లి విషయమై నీ కింత మక్కు వెందులకు ?

గిరీ—మక్కువ యేమి అక్కా! కష్టసమయమందు మానవు లొకరి కొక రడ్డుపడవలెనుకదా!

అని వచించి గిరీశుఁ డేలకో లజ్జావనతవదనుఁడై వెలుపలి కరిగి తోడనే లోనికి మరలివచ్చి కూర్చుండెను.

మనో—మరల వచ్చి కూర్చుంటి వేమి ?

గిరీశు—(మందస్మితముఖుఁడై) అక్కా! నీ వేమియో వారిని గుఱించి బీదయూర్పుల నార్చితివి, కాని నీ పల్కు లన్నియు సత్యములని నమ్మను.

మనో—(విస్మితయై) నమ్మకపోవు టేల ?

గిరీశు—అక్కా! లలిత డబ్బు కర్చుచేయువిధము చూడ ఆమె నిఱుపేదల యింటిబిడ్డయని తోఁచదు. ఎప్పటి కప్పుడు రూపాయలను గుప్పిసి వైచును. ఆనాఁడు నాటకములోనికి తాను రాకపోయినను, మఱఁదలిచేతికిఁ బది రూకల నిచ్చి పంపెను. బిచ్చకుఁడు వచ్చినపు డెల్ల రూపాయికిఁ దక్కువుగ వాని కొసఁగదు.

ఆమె యొక్కతె చేయు వ్యయమే మాసమునకు ముప్పది నలుబది రూపాయలకు తక్కువయుండునని తోఁచదు. పేదవా రింటిబిడ్డయైన లలిత యట్లు లక్ష్యములేని కర్చు సేయఁ జాలునా ? నామాట యనృతమని తోఁచునెడల మన చాకు

మతి నడిగి చూడుము. పేదరాలికి ధనము మంచినీరు ప్రాయ మెట్లగును ?

మనోరమ తమ్మునిపల్కులను విశ్వసింపఁజాలక "అమ్మడూ! మామయ్య చెప్పునది నిజమా ?" యని చారుమతిని ప్రశ్నించెను.

చారుమతి—నిజమే అమ్మా! అవన్నియు చంద్రశేఖరము అన్నయ్యగారూపాయలు. ఇప్పుడే కాదు చిన్నప్పటినుండి వదినె అతని అల్మారునుండి కావలసిన డబ్బు తీసికొనుచుండును. దాని నెవరును ఏమియు అనరు.

మనో—(సందిగ్ధచిత్తయై) అయిన లలిత పైకముఁ దీసికొనుట జంద్రశేఖర మెఱుఁగునా ?

చారుమతి—(తలయూపి)—ఎఱుఁగ కేమి—యెఱుఁగును. అన్నయ్య యెదుటనే వదినె అల్మారు తెఱచి రూపాయిలు తీసికొనుట నేను లక్షమార్లు చూచితిని. జరిగిపోయిన నెలలో అన్నపూర్ణ బొమ్మలపెండ్లి చేసినపుడు అయిన కర్చంతయు ఎవరుపెట్టి రనుకున్నావు మఱి? అంతా వదినెయిచ్చిన డబ్బే కాదూ!

మ—అయి యుండవచ్చును. పిల్లలు బాబువలె కర్కోటకులుకారు. వారికిఁ దల్లిపోలిక వచ్చెను. అందుచే పెట్టుపోతలకుఁ జంద్రశేఖరము చిన్నవాఁడైనను వెనుదీయఁడు. ఆమాటయటుండ లలిత చాల బుద్ధిమంతురాలు. చిన్నప్పటినుండి తలలో నాలుకవలె వారితోఁ గలసి మెలసి యుండి, చంద్ర

శేఖరమును "బావా!" యని ప్రాణమిచ్చి పిల్చును. మేనత్త యొద్దకన్న దానికి భువనేశ్వరి యక్కఁకడ చనువెక్కువ. అందుచే "లలితయనిన నందఱికిఁ జాల యాపేక్ష.—(తనయ నుద్దేశించి) అయితే, అమ్మడూ! నీవు తరుచు వారింటికి వెళ్లుచుందువు. చంద్రశేఖరమునకు మాఘ మాసములోనే పెండ్లియట నిజమేనా!" ముసలివానికి పెద్దమూట దొరుకునని విన్నాను.

చారుమతి.—అవునమ్మా! శేఖరము అన్నయ్యకు పెళ్లి సంబంధం స్థిరమై పోయినది. దొడ్డమ్మ అప్పుడే పెళ్లిపనులను మొదలు పెట్టినది.

౫

పిన్నపెద్దలతోఁ బ్రసంగించుతఱి దామోదరుఁ డనుపమానానురాగవినయములను జూపుచుండును. అహంభావమన నేమో యాతఁ డెఱుంగడు. క్రొత్తప్రాతయను భేదమెఱుఁగక నెల్లఱితోఁ జనవుగ మాటలాడును. దానంజేసి యేవయసు వ్యక్తియైన నాతనితోఁ బ్రసంగింప వాంఛించుచుండును. వయసునఁ దనకంటెఁ జాల చిన్నవాఁడయ్యు, గిరీశునితో దామోదరుఁడు కడు నెయ్యమునఁ బ్రసంగించుచున్న కతన, నెట్టి సంకోచములేక ఆయువకుఁ డాతనితోఁ బలువిషయములు ముచ్చ

టించుచుండును. అందుచే మూఁడునాల్గు దినములలోనే గిరీశ దామోదరుల కతిగాఢమైత్రి కలిఁగెను. దృఢమనస్కుఁడు కాని దామోదరునకుఁ దర్కమందెంత మక్కువయుండెనో; తర్క జయపరాజయములను గుఱించి అంత యుదాసీనత యుండెను. ఏదేని వాదమందుఁ దనకోటమి కల్గినను, నోడితి నని యాతఁడు నొచ్చుకొనువాఁడు కాఁడు.

సంధ్యానంతరమునఁ దేనీరు పుచ్చుకొనుటకు రావలసిన దని దామోదరుఁడు గిరీశుని వేఁడి యుండెను. కచేరినుండి యాతఁడు తిరిగి వచ్చునప్పటికి పగలు కడ తేరిపోవును. కాలుసేతులు ప్రక్షాళన మొనరించుకొని యెప్పటియట్లా తఁడు లలిత నుద్దేశించి "అమ్మా! తేనీరు తయారైనదా?" యని, తనయతో "నీవుపోయి గిరీశముమామను పిలుచుకుని రాతల్లీ!" యనెను.

గిరీశుఁ డరుదెంచగనే ప్రేమపూర్వకముగ దామోదరుఁ డాతనిఁ గూర్చుండ నియోగించెను. ఇరువురు తేనీటిగిన్నెలఁ గరములఁ బూని మెల్లమెల్లగఁ దానిఁ గ్రోలుచుఁ దమదైనిక తర్కములోనికి దిగిరి.

లలిత యపుడపుడు మాతులవెన్కఁ గూర్చుండి వారి ప్రసంగము వినుచుండును. గిరీశుని యుక్తితర్కము లపుడు నవవర్ష ధారలవలె గురిసిపోవుచుండును. ఎట్లైనఁ దనవాక్సు ధచే నారాజానన స్వాంతద్విరేఫముఁ దనువ నాయావనుఁడు యత్నించుచుండును. ప్రస్తుత హైందవ సమాజమునకుఁ బ్రతి

కూలముగ నాతఁ డతిగంభీరముగ నుపన్యసించుచుండును. సంఘీయుల హృదయరాహిత్యము, అసంగత యాచరణ ములు, అపచారములు, అత్యాచారములు మున్నగు విషయ ముల నాతఁ డతి నేసుపృనఁ గడు విపులముగఁ జర్చించుచుం డును.

ఈవిషయములను సమర్థించుటకు, నిక్కముగ జెప్పవల యునదేమియు లేదు. వీనిని గుఱించిన గిరీశుని యుపన్యాస ముత్పీడితహృదయుం డగు దామోదరుని చెవులకుఁ జల్లగ సోకెడిది. తలపంకించుచు "ఔ నౌ" నని యాతఁడా యువ కుని నుడువుల వినుచుండు వాఁడు. నడుమనడుమఁ దనగోడుఁ దాని శ్లోకరువుపెట్టు చుండును; "చిన్నవాఁడా! నీవు చెప్పిన దంతయు నిజమే! అందు సుంతైనఁ బొల్లులేదు. ఎవరిజో క్యము దలపెట్టక, పరుల ప్రసక్తిలేక యీాడుదాటకము న్నవ లీలగ బిడ్డలను తగినవారి కొసఁగి, ముడివెట్టవలెనని యను కొనుచునే యుంటిని—కాని అనుకొనిన కొలఁది నాకది యసాధ్యముగఁ దోఁచుచున్నది. నాయనా! అది మాటలతో నున్నదా? సంఘీయులందఱు ఈడు మించిపోవుచున్నది. ఏదియో యొక మంచిదినముఁ జూచి శుభకార్యముఁ గానిచ్చి వేయుము' అని యందురు కాని గ్రుడ్డిగవ్వయైన సాయమొన రించుటకు ముందునకు రా సాహసింపరు. వారి ముఖప్రీతి వాక్యములు, శుష్కప్రలాపములు నాకేమి మేలొనఁగూర్చును? ఇప్పటి నాయవస్థను చూచుచునే యుంటివి కదా? ఉన్న

యిల్లొక్కటికూడ తనఖాలోఁ బడిపోయెను. ఇపుడో మఱి కొంతసేపటిలోనో పెండ్లాము, బిడ్డలను వెంటఁ బెట్టుకొని యేచెట్టుక్రిందనో కాపురము చేయవలసిన గతి పట్టును. కట్ట గుడ్డగాని, తినఁ గూడుకాని లేని దుస్థితిలో నున్నను, సనాతనధర్మోపన్యాస మొనరించు పెద్దలలో నొక్కరైన 'రా! నాయనా!!' యని తమపంచ నిలువనిత్తురా? ఈ నా పాట్లన్నియు నీవు చూచుచునే యున్నావు కాదా?"

దామోదరుని దైన్యోక్తుల నాలించి, గిరీశుఁడు స్వీయ సమాజము నుగ్గడించుచు, మఱియొక గంభీరోపన్యాస మొసఁగును.

పదపడి దామోదరుఁ డిట్లనుచుండును "అబ్బాయీ! నీవు చెప్పిన వన్నియు వేదాక్షరములు. బ్రహ్మసమాజమునకు పాటివచ్చు సంఘ మేదియు లేదని నేను నొక్కి వక్కాణింపఁగలను. పట్టెవర్ధనములు దిద్ది, పొట్టనిండఁ బప్పుధప్పళములు కొట్టి, సభామండపములపైఁ దోలుబొమ్మలవలెఁ దెయితక్కలాడుచుఁ బ్రాచీనహైందవమహత్త్వమును గుఱించియు, సనాతన హిందూమహాధర్మమును గుఱించియుఁ దమ భాషా వైదుష్యము నంతయుఁ బ్రకాశ మొనరించుచు బ్రహ్మాండనాయకుల మని నటించి మా సంఘీయులలోని యల్పసంఖ్యాకులైనఁ బరోపకారార్థము ముం దంజవేయ గడంగరు!—కాని, నావంటి దౌర్భాగ్యుల నూపుమాప సంసిద్ధులై యుందురు! ఎట్టి కఠోరనియమమైన సువర్ణ సందర్భమున నవనీతసంకాశమై

పోవును. 'పరోపకారార్థ మిదం శరీరం' అని యుచ్చరించుచు, సమయమందే పరుసవేదిని పరమాప్తునిగఁ బరిగణించుచు స్వార్థపరులై నిఱుపేదలపట్ల బ్రహ్మరాక్షసులై తనరు మా సంఘీయులందు సనాతన హిందూధర్మ మెంతగ రాణించుచున్నదో కనులు గల మానవుఁడు వీక్షింపఁజాలకపోఁడు. విభూతిరేఖల నొడలంతయు నలఁదుకొని, యపరబ్రహ్మల వలె గన్పట్టుచు, నర్థజ్ఞానరహితులయ్యు మహామంత్రముల నుచ్ఛరించుచు, నమాయికుల మోసగించుచు మా సంఘీయులలో ననేకులు తమ యెడదలఁ గుత్సితాభిప్రాయముల కాలవాలములు కావించుకొనుచున్నారు. ఇఁక మాకుఁ బతన మేల రాదు ? ఇఁక మమ్ముల దూర నొరు లేల బయల్పడరు? మతము హృదయస్థితమైనచో నీ యర్థరహితమగు నాచారము లేల ? నిజముగ వారు సనాతనమతజ్ఞానము కలవారే యగుచో, నొక యమాయిక యువకుని మంజుభాషచే మోసగించి, యతని నేల జోగిఁజేసి రాష్ట్రవిదూరుఁ గావింతురు? నిరపరాధులఁ బట్టి వీల్చి పిప్పిఁజేయు నీ యోగులు తమ సంధ్యల విరమింపలేదు. కాని, ఆ సంధ్యానుష్ఠానపటిమ యీ కృత్రిమ విన్నాణులం దెట్లు ప్రకాశ మగును? హా! భగవాన్! వీరు మనుజులా? రక్కసులా? రక్కసులుగఁ గన్పట్టుచో బలువురు దూరముగఁ దొలఁగి చని నిరాపదు లగుదురు. కాని వీరు మనుష్యవేషములఁ బూనిన యసురులు. హా! భారత మాతా! నీ కెంత దుర్గతి పట్టినది!' హా! సనాతనధర్మమా!

నీ కెట్టి పతనము కలుఁగుచున్నది. గిరీశమా! ఈ దుర్గతి కు_త్తరవాదు లెవరు? మా సంఘీయులే కదా? అట్టి క్రూరా త్ములనుండి వెలివేయఁబడుటయే మంగళదాయకము. తినుట కేమైన నున్నను, లేకున్నను, మనసునకుఁ గొంత కుదు రుండ వలెను కదా. శోకార్తులై యున్నవారి నెగులు గ్రహింప నేరక—గ్రహింపఁ దలంచుకొనక, విపత్సమయమున నెవ్వా నికిఁ దోడ్పడ గడంగక, రోషకషాయతనేత్రియై నావంటి నిఱు పేదల గళముల నులిమివేయుచు, స్వార్థపరతంత్రియై యొకల కుత్తుకల గోఱికి తన పొట్టఁ బోసికొనుచుండు మా సంఘ హంత్రిప్రోల నిలచియుండుట నా పగిది కటికదరిద్రునకుఁ జెల్లదు! లెక్కలేని ధనరాసులందు దొరలుచు నేచింత లేక, నేగోడు లేక కాలముఁ బుచ్చఁగలవారికే యా సంఘము తగినది. సౌఖ్యముగ, స్వాచ్ఛందముగ, హాయిగ వారే యుం దురుగాక,—మాగతి మా కుండనే యున్నది!”

గిరీశ దామోదరుల ప్రసంగములను లలిత యుద్విగ్న చి_త్తయై వినుచు విస్మృతించెడిది కాదు. రాత్రిపరుండునపుడు నిదురవచ్చునందాఁక నిజసంఘదుర్నయములను గుఱించియే యోజించుచుండును. మామ మాటలన్నియు నామె మనః ఫలకముపై ముద్రితములై యుండ చింతామగ్నయై యుం డును. గిరీశుని పల్కులన్నియు నిక్కములని నమ్మచు, వానిని సంస్మరించుకొనుచు నుండును.

మేనమామపై లలితకు మిగుల భ_క్తి. అతనిపక్షమున

గిరీశుఁ డేమి వచించినను, నామెకు సత్యముగఁ దోఁచు చుండును. తనకొఱకే మామ తొట్రుపడుచుండెననియు, నిద్రాహారములను మాని, యహర్నిశము లాతఁడు వాపోవు చుండెననియు నామె యెఱుంగును. తా నెట్టి యిక్కట్టులకు లోనగుచున్నను, దా నెప్పగిది గభీరదుఃఖమహోదధియందు మునింగియున్నను, దామోదరుఁడు కన్నబిడ్డలకన్న సోదరీ పుత్రికయగు తన్నే మిన్నగఁ జూచుట లలిత యనుదినము వీక్షించుచునే యుండెను. తలిదండ్రులకుఁ గఱవైన తా నాతని తలపైఁ బడిన కతననే పాప మాతని కట్టి తగనిదుఃఖ ము కలుఁగుచుండెనని యా బాలిక గ్రహించెను. "నిరపరాధి యగువానికి వెలిగతి యేల పట్టవలెను? నేఁడు న న్నెవని కైనను కట్టఁబెట్టినను, ప్రారబ్ధవశమున నెల్లి విధవనై మరలి యరుదెంచుచో, వెలి ప్రాప్తింపదా? కాని, నేడవివాహితనై యిం దుండుచో నావెలి తప్పనిసరి యగునా? కాని, రెండు యవస్థలందు భేద మేమి? ఆహా! నిరీహులను సంఘ మెట్టి దుర్గతి కీడ్చుచున్నది? ఈస్థితిని కండ్లారఁ జూచుచుండుటచేతనే గిరీశుఁ డట్లు వాక్రుచ్చుచుండును. కావుననే ఆతని గంభీర వాక్కులు నా హృదయకుహరాంతరాళమున నింకను ప్రతి ధ్వనించుచున్నవి" అని భావాతురహృదయ యగు నాబాలిక కడు కాతరమై తలపోయుచుండును.

తన మామ పడుపాట్లు చూచి యతని దుఃఖము నపన యింప నుంకించుచుఁ జల్లనివల్కు. లాడువాఁ డెట్టి కరుణా

ఖుఁడో లలిత గ్రహించెను. అందుచే నామెకు గిరీశునిపై భక్తిశ్రద్ధలు మెండాయెను. దానంజేసి, గిరీశుని పల్కులను విని నువ్విళులూరుచు లలిత తన మామవలెనే తాను కూడ తేనీరు గ్రోలు సమయమునకై యెదురుచూచుచుండును.

పరిచయము కలిఁగినదాది గిరీశుఁడు లలితను మన్నించుచుఁ బిలుచుచుండువాఁడు. తనకంటెఁ జిన్నయగు బాలికను మన్నించుట దగదనియు, నందుచే లలితను 'నీ' వనియే పిలువుమనియు దామోదరుఁ డొకనాఁ డాతనితోఁ జెప్పెను. అప్పటినుండి గిరీశుఁ డామెను 'నీవు' అని పిల్వనారంభించెను; కడు చనువుతోఁ బ్రసంగింప దొడంగెను.

ఒకనాఁడు గిరీశుఁడు లలిత నుద్దేశించి, "లలితా! నీవు తేనీరు త్రాగవేమి?" అని ప్రశ్నించెను.

నతముఖయై లలిత తలపంకించి యూరకుండెను.

"దానిబావ త్రాగవలదని చెప్పెను. ఆఁడువారు తేనీరు త్రాగు టాతనికి గిట్ట"దని దామోదరుఁడు పల్కెను.

కారణమువిని గిరీశుఁడు కించి దప్రసన్నుఁడయ్యెనని లలిత గ్రహింపఁజాలెను.

మఱునాఁడు సెలవుదినము, అన్యదివసములకంటె శనివారములందు దామోదరగిరీశులు చాలసేపు ప్రసంగించుకొనుచుందురు. అందుచే నేఁడు దేనీరు గ్రోలుట ముగిసినను, గిరీశుఁడు తన యుపన్యాసమును విరమింపలేదు. కాని, దామోదరుఁ డేలకో ప్రతిదినమువలె ప్రమోదముతోఁ బ్రసంగింపకఁ

దఱచుగ నన్యమనస్కుఁడు కాఁ దొడఁగెను.

అన్నపూర్ణ తన్నెప్పుడును, మామయని పిలచుచున్నను, గిరీశుఁ డేలకో దామోదరుని "బాబూగారూ!" అని పిలువ నలవాటు గావించుకొనెను.

దామోదరుఁ డన్యమనస్కుఁడై యుంటఁ గాంచి గిరీశుఁడు "నేఁడు బాబుగారికిఁ గొంచెము నుస్తీగా నున్నటు లున్న" దనెను.

దామోద—(నోటినుండి చెుటకమూలు వాలుకొట్టె మీఁవలికిఁ దీసి)—నుస్తీ యేమియులేదు. శరీరము మామూలు స్థితిలోనే యున్నది.

గిరీశు—(సంకోచభావమున)—అట్లైనఁ గచేరిలో నేఁ డేమైన—

దామోద—నాయనా! నీ దయవల్ల నేఁడు నాకు గచేరిలో చీవాట్లు తగులలేదు.

అని యూతఁ డొకించుక యబ్బురపాటున గిరీశుని దేశ చూడ సాగెను. దామోదరుని చిత్తము నేదో కలచుచున్నట్లాతని ముఖమండలమునఁ బ్రకాశమగుచుండుట సరళస్వభావుండగు నా యువకుఁడు గ్రహింపఁజాలకపోయెను.

లలిత యింతకు మున్నెనియుఁ బలుకక, మాతులపొంతఁ గూర్చుండి యుండెడిది. కాని, యిపుడు తానుకూడ నడుమ నడుమ నొకటి రెండుమాటలఁ బల్కు దొరఁకొనెను. మేనమామ ముఖలక్షణముల నుపలక్షించి యామె, అవును

మామయ్యా! నీ ముఖము నేఁడేమియు బాగుగ లేదు. నీ మన స్సేలకో చెడియుండును' అనియెను.

దామో—(శుష్క హాసనము సల్పి)—అవును తల్లీ! నీవు సరిగ గ్రహింపఁ గలిగితివి. నిక్కముగ నేఁడు నా మనసే మియు బాగుగ లేదు.

లలితా గిరీశు లిద్దర నిమేషమలోచనులై యాతని విలో కింపసాగిరి.

దామో—సాయంకాలము కచేరినుండి తిరిగి వచ్చుచుండ శ్యామసుందరను అన్న కనఁబడి త్రోవలో నిలువఁబెట్టి అప్పు విషయమై నిక్కచ్చిచేసి చాల నిష్ఠురముగా మాటలాడెను. పాప మాతని తప్పేమి? ఆఋమాసములై ఋణముఁ దీసి కొన్నను, నేఁటి సరికొక పైసయైనను తీర్పజాలనైతిని. ఏ నెల కానెల వడ్డీపై వడ్డీ పెఱుగుచునే యున్నది. అసలు మాట టుండ, ఫాయిదా యైనఁ దీర్పఁజాలనపుఁడు ఋణదాత యెట్టి సుశీలుఁడైనను, యెట్లోరిమి వెట్టియూరకుండును?—

అని యాతఁ డింకను నేమో పల్కఁబోవుచుండ, లలిత సంగతి గ్రహించి యపూయికుఁడగు మేనమామ యింటి గుట్టంతయుఁ బరాయి పెద్దమనిషికడ నే కరువు పెట్టునేమో యను భయముతో నతని మాటకడ్డువచ్చి మామయ్యా! అందులకై యిప్పుడీ చింతయేల? పిదప యోజించుకొందములే! యనియెను.

కాని, దామోదరుఁడు లలితభావమును గ్రహింపఁజాలక

తన ధోరణిని తాను కట్టిపెట్టక, విషణ్ణభావముతో నవ్వి "అమ్మా! పిదప యోజించు నదేమి! ఈ పుట్టి ములకనుండి దాటు టెట్లు?—గిరీశమూ! నా అమ్మ నేనుకంటఁ దడిఁ బెట్టుటఁజూచి సహింపలేదు. మమకారము పోమ్మన్నను ఎట్లు పోవును?—పైవారు నిర్భాగ్యుఁడైన తన మేనమామ కష్ట పడుచుండఁ గన్నతల్లియైన మూడరని బిడ్డ యెంతో దుఃఖించు చుండును" అని డగ్గుత్తికతోఁ బల్కెను.

గిరీశు—శ్యామసుందరముగా రాఁడిన నిష్ఠురోక్తులేమి? మామ యుదంతము నంతయు గిరీశుఁ డీవఱలోనే వినియుండె నను విషయము లలిత యెఱుంగదు. అందుచే వానిప్రశ్న మిగుల నసంగతమైన దని యోజించి, యామె మనసునఁ జాల కినుకఁ జెందెను.

గిరీశుఁడు క్రొత్తవాఁడని యిసుమంతైన సంశయింపక దాచకఁ దామోదరుఁడున్న దున్నట్లు జరగిన దంతయు నా తనికడ వెడలఁ బోయదొడఁగెను. శ్యామసుందరుని సతిచాల కాలమునుండి అజీర్ణరోగముచే బాధఁబడు చుండెననియు నిప్పు డావ్యాధి యొకించుక యెక్కుడగుటచేఁ వాయు పరివర్తన మొనరించు టవసరమని వైద్యుఁడు చెప్పెననియు, నందుచే నిపుడు సొమ్ము వారికి కావలసి వచ్చెననియు, నేఁటివఱకైన వడ్డియు, నసలు సొమ్ములోఁ గొంతయు నొసంగవలసినదిగా శ్యామసుందరుఁడు కోరెననియు సారాంశముగఁ దెల్పెను.

కొంచెము సేపేమియుఁ బలుకక పిదప గిరీశుఁడు మృదు

స్వరమున నిట్లనియెను. "బాబుగారూ! మీతోఁ జాలదిన ములనుండి నేనొక విన్నపముఁ గావింపవలెనని యనుకొనుచు సాహసింపఁ జాలకున్నాను. తాము అన్యథా యోజింపనిచో నా యభిప్రాయము నిపుడు తెలిపెదను".

దామో—(మందహాస మొనరించి)—ఎవరైన, నెన్నఁడైన, నేదియైన నాకుఁ దెలుపుటకు సంకోచించి యుండుట నే నీ వఱలో నెఱుఁగను—నాయనా! ఏమి చెప్పఁదలఁచితివో చెప్పుము.

గిరీశు—శ్యామసుందరముగారు చాల వడ్డీమీఁద ఋణ మిచ్చియుండెనని మా అక్క నాకీ వఱలో నేదియో ప్రసంగ వశమునఁ దెలిపెను. అపుడు నా మనసున నొక యాలోచ నము తట్టెను. పెద్దమొత్త మిపుడు నా యింటఁబడి మూల్గు చున్నది. నా కిపుడు దానియుపయోగ మేమియులేదు. మీ ఋణప్రదాత కిపుడు సొమ్ము అవసరముకూడ చాలయున్న దని చెప్పుచుండిరి. అందుచే యిపుడే మీరీ యప్పును తీర్చి వైచుకొనుట యుక్తమని యోజించు చుంటిని. అట్టి బరువు తలపైనున్న యెడల, యెప్పటికేమి జరుగునో చెప్పఁజాలము కదా!

గిరీశుని పల్కులను విని, లలితా దామోదరులు కడు నచ్చెరువొంది, యనిమేషనయనులై యతనిని వీక్షింపసాగిరి.

అత్యంతసంకోచమున నా యువకుఁడు మరల నిట్లు పల్క దొడంగెను. "నా కిపుడు విత్తముతోనిక్క యక్కఱయేమియు

లేదు. అందుచే మీకు వీలు చిక్కినప్పుడే సొమ్మునాకీయ వచ్చును. ప్రస్తుత మా యుత్తమర్ణునకుఁ బైక మవసరమని యనుచుండెను కావున జెప్పితిని, ఇందు—

దామో—(మెల్లనిస్వరమున)—ధనమంతయు నీ వీయఁగ డంగుదువా?

గిరీశు—(నతముఖుఁడై)—అట్లే యిత్తును. అందుల కింత యాలోచనయేల? మనయవసరముఁ దీర్చినవారి యవసరము—

ఆతని మాటకడ్డువచ్చి, దామోదరుఁడేమో చెప్ప నుంకించుచుండ నింతలో లోపలినుండి యన్నపూర్ణ పర్వుపర్వున వచ్చి, "వదినా! వదినా! మఱే! వెంటనే మంచిబట్టలు కట్టుకొని సిద్ధముగా ఉండమన్నాడు అన్నయ్య. మనలనందఱను నాటకములోనికి తీసికొనవెళ్లునట" అని యొక్క తృటిలో నందుండి యదృశ్యయై పోయెను. తనయ వ్యగ్రతఁగాంచి దామోదరుఁడు నవ్వెను. లలిత యేమియుఁ బలుకక యూరకుండెను.

ముహూర్తానంతరమున నన్నపూర్ణ మరలివచ్చి, "ఏమి వదినా! ఇంకను లేచితివి కావేమి? నీకొఱకు మేమందఱము కనిపెట్టుకొని యుంటిమి. త్వరగా రా లేకపోయిన మేము వెళ్లిపోయెదము."

కాని, లలిత లేచి వెడలుట కుద్యమింపక యట్లే కూర్చుండెను. అన్నపూర్ణ చెప్పినదంతయుఁ బూర్తిగ వినినపిదప బోవలెనని యామె తలఁచుచుండెను.

దామోదరుఁడు తనయను తేఱిచూచి, చిఱునవ్వు నవ్వి,

మేనకోడలి ముంగురులను సవరించుచు "అమ్మా! అట్లైన వెళ్లుము. నీకొఱ కందఱు కనిపెట్టుకొని యున్నారు కాఁబోలు" ననియెను.

లలిత లేవక తీరినదికాదు. గిరీశునిపై గభీరకృతజ్ఞతాదృష్టి నిక్షేపించి, చిన్నారి యల్లనల్లన వెలుపలి కరిగెను. ఆప్రణయ జిజ్ఞాసు వా భావపూర్ణావలోకనము నాలోకించి ప్రఫుల్లముఖుఁ డాయెను.

పదినిముసములైన పిదప శుభ్రాంబరములను ధరించుకొని, ప్రయాణసంసిద్ధయై తాంబూలమొసఁగు సాకుఁ గల్పించుకొని చిన్నారి మఱొకమాఱు మెల్లగ మామయున్న చోటుకు వచ్చెను.

తాను నిష్క్రమింపఁగనే గిరీశుఁడు కూడ నిష్క్రమించె నని లలిత యెఱుంగదు. అపుడు దామోదరుఁ డొక్కఁడు నుపధానమున నుత్తమాంగమిడి నిమీలితనేత్రుఁడై పరుండి యుండెను. ఆతని ముద్రితాక్షుల కొనలనుండి యశ్రువులు స్రవించుచుండెను. అవి యానందబాష్పములని లలిత గ్రహించెను. కావున నాతని ధ్యానము జెఱుప సాహసింపక వచ్చి నట్లే మెల్లగ లలిత వెలుపలికి వెడలిపోయెను.

తోడనే యామె చంద్రశేఖరుని యాగారములోని కరిగెను. బావగదిఁ బ్రవేశింపఁగనే యేలకో యామె నేత్రముల నుండి యశ్రుప్రవాహము బయలుదేఱెను. అన్నపూర్ణ యప్పు డచటలేదు. ఆమె యందరికన్న ముందరిగి బండిలోఁ గూర్చుం

డెను. లలితరాక నపేక్షించుచు జంద్రశేఖరము మాత్రము తనగదిలో నిలువంబడి యుండెను. రమారమి పదిదినముల నుండి లలిత కాన్పింపకుండుటచే నతఁ డాకించుక కినిసెను. కాని యామెవచ్చి కంటఁ బడఁగనే పరమప్రమోదసంభరిత స్వాంతుఁడై చంద్రశేఖరము ముందునకరిగి "దేవిగా రిప్పటికి శాంతించితిరి కాఁబోలు" ననియెను. కాని, తోడనే బాష్పా కీర్ణములై యున్న యామె లోచనసరోజముల నుపలక్షించి మిగుల నుద్విగ్నుఁడై యాతఁడు "లలితా! అదేమి?— ఏడ్చుచుంటివా యేమి?" అనెను.

బావ పలుకరింపఁగనే లలిత దుఃఖము పొంగి పొరలి పోయెను. ఆతనిమాటల కేమియు నుత్తర మొసఁగక నతము ఖయై లలిత లేదని సూచించుచుఁ దల త్రిప్పెను.

చిరసంగిణిని ౘేరలకుఁ దీసికొని, నిజకరములచే నామె ముఖకమలము నెత్తి "ఏమి లలితా! ఏడ్చుచుంటివి? నిన్నెవ్వ రైన నేమైన ననిరా యేమి? నాతోఁ జెప్పవు? బావనుకానా?" అని యాదరానురాగము లుట్టిపడ చంద్రశేఖరము పల్కెను.

లలిత దుఃఖసంవరణ మాచరించుకొనఁ జాలకపోయెను. చివాలున నేలపైఁ జతికిలపడి, చేలాంచలిచే వదనారవింద మును కప్పుకొని లలిత వెక్కి వెక్కి యేడ్చెను.

అసలు ఫాయిదాలతోఁ దనకు రావలసిన యావత్తు సొమ్మును అణాపైసలతో లెక్కవెట్టుకొని తనఖాపత్రము. నీయలేక యీయలేక దామోదరుని కొసఁగి శ్యామసుందరుఁడు "తమ్ముఁడూ! నీకీసొమ్మంతయు నెవరిచ్చిరి?" అని ప్రశ్నించెను.

దామోద—(వినమ్రుఁడై) అన్నా! ఆవిషయము బ్రశ్నింపకుడు—దానిని బయల్పఱుపరాదను నిషేధమున్నది.

పెద్దమొత్తము చేతఁబడినందులకు శ్యామసుందరుఁడు సంతుష్టుఁడు కాలేదు, తన కావిత్తము ముట్టునని యాతఁడు కలనైనఁ దలఁపలేదు. అది ముట్టక పోవలెననియే యా యుత్తముఁడభిలషించెను. దౌర్భాగ్యదామోదరుని కొంప యొక్కటిఁ బడగొట్టి క్రొత్తపంథిని నొక పెద్దమేడఁ గట్టింపవలెనని పాప మాపెద్దమనిషి యూహించి యుండెను. కాని యా యాస యడియాసయైపోయెను.

శ్యామసుం—(వ్యంగస్వరమున)—అవును. పాపమెట్లు బయల్పఱుతువు? ఎట్టి నిషేధములు లేనిదే మనదినములు గడగడచునా? తమ్ముఁడూ! తప్పునీదికాదు. తప్పంతయునాది—నాయనా! అవసరముగానున్నదిరాయని సొమ్మెదుగుటతప్పెపోయినది. కలికాలము కదా!

దామోద—(వ్యథితచేతస్కుఁడై)—అన్నా! మీరట్లనఁ

జెల్లునా? మీ యర్థఋణమును తీర్చివేయఁగలిగినను మీ కృపాఋణముఁ దీర్పఁజాలితినా?

శ్యామసుందరుఁడు నవ్వెను. అతఁడన్ని వేషము లెఱిఁగిన వేషకాఁడు! ఇట్టిమెత్తని నుడువులను నమ్మువాఁడగుచో; బెల్లమమ్మ లక్షాధికారి కాలేకనే పోవును.

"తమ్ముఁడా! నిజముగా నాయందు నీ కట్టి యభిమానమే యున్న యెడల, చెప్పుఁదీసికొని వేసిన ట్లీవిధముగ సొమ్ము నాముఖమునఁ గొట్టియుందువా? ఒకమాఱు సొమ్మును గుఱించి నీతోఁ జెప్పినమాట నిజమే! అడిగనని కిన్కఁజెంది తివికాని, పాపమీతఁడెందుల కడిగెనోయని సుంతైన యోజించితివా? మీ వదినె మంచమునఁ బడియున్నందున ఎచటను సొమ్ముపుట్టనందున నిన్నడుగవలసివచ్చెను. కష్టకాలములోనున్న నిన్ను అడుగ సాహసించినపుడు నామనసెట్లు పరితాపపడెనో పరమేశ్వరుఁడెఱుఁగును. అయినను, ఆపైకము నాకొఱకై నిన్నడిగియుండలేదు. మీవదినెకొఱకే అడిగితిని. పోనిమ్ము నిన్ను బాధపెట్టుటెందులకని యెన్నెన్నియో కొంపలు తిరిగితిని. నిప్పడిగిన, పెంకు జామీనీయమన్నవారే కాని, యనుకూలముగ జెప్పువారెవ్వరు కాన్పించలేదు. పోనిమ్మా విషయ మికనెందుకు—అయిన, కొంప తనఖా యెంతవడ్డీమీఁదఁ బెట్టితివి?"

"అన్నగారూ! నే నెవరికిని తనఖాపత్రము వ్రాయలేదు. వడ్డీమాట యేమియు రాలేదు."

దామోదరుని పల్కులను శ్యామసుందరుఁడు విశ్వసింపక విస్మయపూర్వకముగ « వడ్డీలేకుండనే తెచ్చితివా అప్పు ? » అని ప్రశ్నించెను.

“చిత్తము. వడ్డీలేకుండగనే తెచ్చితిని. పిల్లవాఁడు చాల బుద్ధిమంతుఁడు. మంచి అంతఃకరణము కలవాఁడు”.

శ్యామ—(అబ్బురమున)—పిల్ల వాఁడా? ఆపిల్లవాఁడెవఁడు?

దామోదరుఁ డాప్రశ్న కుత్తరమొసఁగలేదు. మౌనము దాల్చికూర్చుండెను. ఇంతదనుక నాతఁడుచ్చరించినదే ప్రారబ్ధ వశమున నోటినుండిజారిపోయెను.

శ్యామ—(దామోదరుని యభిప్రాయమును గ్రహించి, నవ్వి) తమ్ముఁడా! వెల్లడి పరుపరాదను నిషేధమున్నపుడు తెలుపుటెందులకు?—కాని, చిన్ననాఁటనుండి నేను పలువిధ ముల మనుష్యులనుచూచినవాఁడను ; కావున నీవు పాపము సత్యకాలపుమనిషివని, నీశ్రేయముఁగోరువాఁడనని చెప్పవలసి వచ్చుచున్నది. ఆతఁ డెవఁడైననేమి ? ఈమాటయు ఆమా టయుఁజెప్పి వెఱ్ఱివానిఁ జేసి, తుదకు నిన్నాతఁడు నట్టేట ముంచకుండఁ జూచుకొమ్ము!

దామోదరుఁడింకేమియుఁ బలుకక, ప్రణామ మాచరించి, పత్రమును చంకఁబెట్టుకొని నిజాలయమునకు మరలిపోయెను.

రమారమి ప్రతివత్సరము భువనేశ్వరి విశాఖపట్టణమునకరిగి సాగరతీరమునఁ గొంతకాలముండి నిజపురమునకుఁ దిరిగివచ్చు చుండును. అజీర్ణ రోగపీడితయగుటచేత వాయు పరివర్తన

మాకెకుఁ జాల గుణమొసఁగుచుండెడిది. ఈసాకుతోఁ గార్యము చక్కబెట్టుకొనుటకై శ్యామ సుందరుఁ డానాఁడు దామోదరునితో భార్య రోగమును గుఱించి విశేషించి చెప్పెను. కాని, యానిరుపేద సామ్మొయ్యఁగలఁడను నూహ యాతని కావంతయైననుండినచో, బావమాతఁ డట్లు వచింపకనే యుండును. ఇపుడేమనుకొనిన నేమిఫలము ? జరుగవలసినది జరిగిపోయెను. ప్రయాణార్థము భువనేశ్వరి వలయు సన్నాహములను సలుపుచుండెను.

ఆనాఁటి ప్రాతఃకాలమునఁ జంద్రశేఖరము తన పేటికయందవశ్యమైన వస్తువుల నొక్కటొక్కటిగఁ జేర్చుచుండెను.

అన్నపూర్ణ, యాగారమునఁ బ్రవేశించి ,,అన్నయ్యా? మీరు రేపు వెళ్లిపోవుదురు కదూ ?'' అనెను.

చంద్రశేఖరము—(శిరమెత్తి) వదిన నొకమాఱు పిలుచుకొనిరమ్మా. కూడ నేమేమి తీసికొనిపోవలెనో దానికి బాగుగా తెలియును. రేపు ప్రయాణముఁ దలపెట్టుకుంటిమని యెఱిఁగి యుండియుఁ దన బట్టల నింకను సర్దుకొనలేదు. త్వరగా పిలుచుకొనిరమ్మా.

ప్రతివత్సరము లలిత భువనేశ్వరీ చంద్రశేఖరులతో విశాఖపట్టణము పోవుచుండెడిది. ఈమాఱుకూడ నామె వచ్చునని యాతఁడు తలంచెను.

అన్నపూర్ణ వదినె బట్టలు సర్దుకొనుట యెందుకు? ఈ సారి అది రాదని నీకు తెలియదూ

చంద్ర—ఎందుకురాదు?

అన్న—బాగుంది. ఎందుకు వచ్చునేమిటి? మాఘ మాసములోనో ఎప్పుడో దాని పెండ్లియట. పెళ్లికొడుకు కొఱకు బాబయ్య యెంతతిరుగుచున్నాడో తెలియదూ?

నిర్నిమేషాత్ముండై చంద్రశేఖర మేమియుఁ బలుకక కూర కుండెను.

నిజాలయమునఁ దాను వినిన విషయముల నన్నిటినొక్కటొక్కటిగ నన్నపూర్ణ యుత్సాహపురస్సరముగఁ జెప్పదొడఁగెను. “ఎంతసొమ్మైనను సరే, మంచివరుని వెతుకవలెనని గిరీశము మామయ్య చెప్పెను. ఈవేళకూడ బాబయ్య కచేరికి వెళ్లడు. భోజనముచేసి, యెక్కడో పిల్లవానిని చూచుటకై పోవునట. మామయ్యకూడ వెళ్లును.

నిశ్చలచిత్తుఁడై చంద్రశేఖర మన్నపూర్ణపల్కులను విని, లలిత తమ్మనుసరించి విశాఖపట్టణమున కేల రాఁజాలదో హృదయంగమము, గావించుకొనియెను.

అన్నపూర్ణ—గిరీశము మామయ్య చాల మంచివాఁడు. నీరజ అక్కయ్య పెండ్లికి బాబయ్య మాయింటిని పెద్దబాబయ్యదగ్గఱ తనఖాపెట్టుట యెఱుఁగుదువు కదా! రెండు మూఁడు నెలలైన తరువాత మేమందఱము ఇల్లువిడిచి, ఊరూర బిచ్చమెత్తుకొని బ్రతుకవలెనని బాబయ్య అనుచుండువాఁడు. జాలిగుండెవాఁడు కనుక గిరీశము మామయ్య ఆ దబ్బంతా యిచ్చినాఁడు. అందుచే బాబయ్య అప్పంతయు

నిన్న తీర్చివేసినాఁడు. ఇఁక మనకేమి భయములేదని వదినె చెప్పినది. అన్నయ్యా! వదినెచెప్పినమాట నిజమే కాదా?

చంద్రశేఖరము ప్రత్యుత్తర మేమియు నొసఁగఁజాలక పోయెను. నిర్విణ్ణుఁడై యతఁడేమో యోజించుచుండెను.

అన్నపూ—అన్నయ్యా! ఏమి యాలోచించుచుంటివి?

అన్యమనస్కుఁడై యున్న చంద్రశేఖర మన్నపూర్ణ ప్రశ్న విని, చకితుఁడై తొట్రుపాటున "ఏమియులే దేమియులే" దనెను.

చంద్ర—(క్షణానంతరమున)—అన్నపూర్ణా! వదినె నొక మాఱు నేను పిలుచుచుంటినని త్వరగా దీసికొని రమ్ము. బావ రమ్మనుచున్నాఁడనిన చాలును—ఒక్క పరుగులోఁ బోయి రావలెను.

అన్నపూర్ణ కడువడిగ నిష్క్రమించెను.

ముందుఁగల పెట్టెపై వెడగుచూడ్కుల నిగుడించుచుఁ జంద్రశేఖరుఁడు కూర్చుండి యుండెను.

అన్నపూర్ణ పోయి చెప్పఁగనే లలిత మేడపై కరుదెంచి, గవాక్షముగుండా చంద్రశేఖరుని గదిలోనికిఁ దొంగిచూచెను. ముందుఁగల సామానుపై వెఱ్ఱిచూపులఁ బఱపుచు, బావ నేలపైఁ బిచ్చివానిలీలఁ గూర్చుండి యుండెను! అట్టి వికార లక్షణముల నెన్నఁడు లలిత చంద్రశేఖరుని ముఖమండలమున వీక్షించి యుండలేదు. ఆశ్చర్యముతో నామె నెమ్మదిగ లోని కరుదెంచి, బావచెంత నిలువం బడెను. కొంతవడికి చంద్ర

శేఖరుఁడు ప్రక్కకుఁ జూచి—"సీవా! రమ్మ్మ" అని చివాలున లేచి నిలువంబడెను.

లలిత—(మృదుస్వరమున)—బావా! పిలచితివా?

చంద్ర—అవును! (క్షణకాలము స్థిరభావమూని) తేపటి యుదయపు రైలులో అమ్మను తోడ్కొని నేను విశాఖపట్ట ణము పోవుచుంటిని. ఈపర్యాయము ప్రాయశః మరలివచ్చుట కాలస్యమగును. ఈతాళము చెవిఁ దీసికొనుము. నీకర్చునకై డబ్బు నీ యల్మారునందుంచి పోవుచుంటిని.

లలిత ఛాయచాప్పున బావ ననుసరించి యుండును. ప్రతి పర్యాయమామె చంద్రశేఖరముతోఁ గూడ విశాఖపట్టణ మున కరుగుచుండెడిది. గతవత్సర ప్రయాణమునకు వలయు వస్తుల నన్నిఁటి నామె పరమప్రమోదమున సిద్ధమొనరించెను. ఈమా టాపనిఁ జంద్రశేఖర మొక్కఁడే కావించుకొను చుండెను.

అర్ధోన్మీలితమైన పేటికముందు కింకర్తమూఢుఁడై కూర్చుండియున్న యతనిఁ గాంచఁగనే లలిత చిత్తము చివు క్కుమని పోయెను.

చంద్రశేఖరుఁడు లలిత దెసనుండి దృక్కుల మరలించి, ముఖమొండు వలనుకుఁ ద్రిప్పుకొని, డగ్గుత్తిక నడంచుకొను వానిలీలఁ గంఠము సవరించుకొని చంద్రశేఖర మిట్లనెను. "లలితా! జాగ్రత్తగనుండుము—నీకింకను ఏమైనఁ గావలసిన చో పెద్దబావ నడిగి విలాసముఁ బుచ్చుకొని, నా కుత్తరము

వ్రాయుము. ఈవిషయమును విస్మృతింపకుము".

అనంతర మిర్వురు మాట్లాడకుండ కూర్చుండిరి. లలిత తా నీ పర్యాయము రానను విషయము బావ యెఱుంగఁ జాలెననియు, రాఁజాలకుండుటకుఁ గారణముకూడ నతనికిఁ దెల్లమై యుండుననియు యోజించి కడు లజ్జితయై యేమియుఁ బల్కనేరక నతముఖయై యుండెను.

కొంతవడికి శేఖర మాకస్మికముగఁ జైతన్యమునొందిన వానిలీల చకితుఁడై యిట్లనియెను. "మంచిది లలితా! వెళ్లుము. ఈసామానంత నేనిపుడు సర్దుకొనవలెను. వేళయయినతోడనే నేఁడుకూడ నొకమాఱు కచేరికిఁ బోవలెను—ఎట్లో తంటాలు పడెదను".

లలిత—(తెఱువఁబడియున్న పెట్టెయొద్ద మోకరించి కూర్చుండి)—నీవు స్నానమునకుఁ బోయిరమ్ము. వీని నన్నిఁటిని నే నమర్చెదను.

"అక్కఱలేదు. నీకిఁక జిక్కులే"దని, చంద్రశేఖరము బీగము నచటఁ బడవైచి, గది వెలువడెను. కాని తోడన నిలువంబడి "నాకేమేమి కావలయునో మఱచిపోలేదు కదా లలితా!" యని కేకవైచెను.

నతవదనయై మోాల ప్రోగుపడియున్న బదార్థముల లలిత పరీక్షింప దొడఁగెను. బావప్రశ్న కామె యుత్తరమొసఁగ లేదు.

చంద్రశేఖరము క్రిందికిదిగి మ్యాంత నడిగి యన్నపూర్ణ తెలి

పిన యుదంతమంతయు యదార్థమని యెఱుంగఁ జాలెను— దామోదరుఁడు తనయప్పునంతయుఁ దీర్చివేయుటయు, లలితకుఁ దగువరు నన్వేషించుటకై యాతఁడు మిక్కుటమగు శ్రమపడుచుండుటయు నిజమేయని యాతనికి తెలియవచ్చెను. ఇఁక జనయిత్రి నేమియుఁ బ్రశ్నింపక చంద్రశేఖరము స్నానార్థమై వెడలిపోయెను.

స్నానాదులను నిర్వర్తించుకొని కొంతసేపటి కతఁడు కచేరీ కరుగుటకై యుడుపుల ధరించుకొనఁ బైకి వెడలెను. అతఁడు తనగదిని ప్రవేశించి నిజముగ విభ్రాంతుఁడై నిలువున నిలిచి పోయెను.

ఇంతసేపటి నుండియు లలిత యేమియుఁ గావింపక, పేటిక మూతపై నుత్తమాంగమిడి, నీరవయై కూర్చుండెను. బావ పదముల యలికిడి విని యామె చకితయై యొకమాఱు ముఖ మెత్తి మరల నతశీర్ష యాయెను. ఆసుందరి కన్నుదమ్ములు జపకుసుమముల లీల నెఱ్ఱనై యుండెను.

లలిత రక్తారుణనేత్రముల నుపలక్షించియు వీక్షింపనట్లు నటించి చంద్రశేఖరము మ్రోలనున్న మేజాబల్లపై నుపవిష్టుఁడై కచేరీపుట్టములను ధరించుకొనుచు, "లలితా! ఆపని యిఁక నిపుడు కాఁజాలదు. మధ్యాహ్నమువచ్చి వాని నమర్చు" మని పల్కి పదంపడి కచేరీకి నడచెను. లలిత చక్షు లెఱ్ఱనై యుండు హేతువు నాతఁడు గ్రహింపఁజాలక పోలేదు. కాని, అన్ని విషయములను బాగుగ యోజింపక మున్నా

లతాంగి నేమియుఁ బ్రశ్నించుట కాతఁడు సాహసింపలేదు.

ఆనాఁటి సాయంకాలము దామోదర గిరీశులకుఁ దేనీ రొసఁగ విశ్రాంతమందిరమునఁ గాలిడి లలిత హఠాత్తుగఁ జకితయైపోయెను—నేఁ డామె బావకూడ నందుఁ గూర్చుండి యుండెను. తనప్రయాణమునకు ముందు దామోదరుని సెలవు గైకొనుటకై చంద్రశేఖర మానాఁ డచటి కరుదెంచెను.

లలిత తలవంచుకొనియే కడు సంకుచితభావమున రెండు గిన్నెలందుఁ దేనీరుఁ బోసి వానిలో నొకదానిని మామ యొద్దను రెండవదానిని గిరీశుని ముందలను నుంచెను.

గిరీశు—(లలిత ముఖమును తేఱిచూచి)—లలితా! చంద్రశేఖరముగారి కిచ్చితివి కా వేమి ?

వంచిన వదనము నెత్తకయే మెల్లని స్వరమున లలిత "మా బావ తేనీరు త్రాగఁ" డనెను.

గిరీశుఁ డిఁకేమియుఁ బల్కలేదు. లలిత "బావ" యని చంద్రశేఖరుని సంబోధించుటాతని కంత సమంజసముగఁ దోఁచలేదు. తనబావ తేనీరు త్రాగఁడనియు నితరులు దానిఁ గ్రోలుటాతని కిష్టములేదనియు, నీ వఱలో నొకమాఱు లలిత తనతోఁ జెప్పిన విషయ మత్తఱి వానికి జ్ఞప్తికి వచ్చెను.

తే నీటిపాత్రను కరమందిడుకొని, దామోదరుఁడు లలిత పెండ్లి మాటలయం దవతీర్ణుఁ డయ్యెను. కతిపయదినముల నుండి కావించిన యన్వేషణ మంతాతని కొక సంబంధము

కాన నయ్యెను. దాని విషయమైయే దామోదరుఁ డిపుడు ముచ్చటించు చుండెను. "చిన్నవాఁడు పట్టపరీక్షకుఁ జదువు చున్నాఁడు. బుద్ధిమంతుఁడు. మంచిసాంప్రదాయములోని వాఁడు—అన్నవస్త్రములకు లోపములేదు. పదిమందిలోను తలయెత్తుకుని బ్రదుకఁ జాలువాఁడు. కాని, యతఁడు మా గిరీశమునకు నచ్చలేదు. చూచుటకుఁ జిన్నవాఁడంత చక్కని వాఁడుగా కాన్పింపఁడు. కాని మగవాని కందచందములతో బనియేమి? గుణము మంచిదగుచో చాలును. మా ముత్తాత గారి పెదతండ్రి యెంతో యందగాడఁట—ఎందులకు! కట్టు కొన్న యాడుదాని నాతఁడు ముప్పతిప్పలఁ బెట్టువాఁడఁట! ఇఁక నాలసింపక మా లలితకు ముడి వెట్టకపోయిన యెడల నలువురిలోను నాకు నగుబాటు తప్పదు. ఎట్లో యట్లు శుభ కార్యము జరిగిపోయిన యెడల బ్రదుకుజీవుడా యనుకొని గట్టె క్కుదును.

చంద్రశేఖరముతో గిరీశుని కిపుడే యొకించుక పరిచయము కలిగెను. చంద్రశేఖరము గిరీశుని ముఖమవలోకించి చిఱు నవ్వుతో "గిరీశముగారికి చిన్నవాఁడు నచ్చకపోవుటేల? చదువు సంధ్యలకు గాని, స్థితిగతులకు గాని లోటులేనపుడిఁక సంశయమెందులకు?" అని ప్రశ్నించెను.

ఇట్లు ప్రశ్నించినను, గిరీశున కా పెండ్లికొమరుఁడేల నచ్చ లేదో చంద్రశేఖర మెఱుఁగక పోలేదు. అతఁడే కాక, మఱియే వరుఁడును కూడ నా యువకునకు నచ్చుట యసంభవమని

కూడ నతఁడు గ్రహించెను.

చంద్రశేఖరుని ప్రశ్నకు గిరీశుఁడు సత్వరమే ప్రత్యుత్తర మొసఁగఁ జాలకపోయెను. అతని ముఖమం దొకించుక రక్తాభ పొడకట్టెను. దానిని లక్ష్యించి యిఁక నాతని నేమియుఁ బ్రశ్నించుట యుక్తము కాదని గ్రహించిన చంద్రశేఖరము లేచి నిలువం బడి "చిన బాబయ్యా! అమ్మను తీసికొని రేపు విశాఖపట్టణము పోవుచుంటిని. ఒకించుక ముందే శుభవర్త మానము దెలుపుట మఱువకుఁడు" అనియెను.

దామో—నాయనా! నీ వట్లు చెప్పవలెనా? మీరు పూనుకొనకుండ, నేనేమి చేయఁజాలుదును—మీరే కదా నాకు పరమముఖ్యులు. కార్యముఁ దలఁపెట్టుకొనిన పిదపఁ పెద్దది వదినె దగ్గఱలేనిచో, మేమేమి చేయుటకు సమర్థులము? ఆమె చేయి నాలుఁగు కార్యములు చేసిన చేయి. ఎందులకైన నామె చెప్పుమాటలలోను, చేయు చేతలలోను విలువయుం డును. పిన్ననాటనుండి ఆమె బిడ్డవలె పెరుగుచున్నది మా లలిత ఈ వేడుక ఆమె చూచుటే కదా ముఖ్యము. ఏమం దువు అమ్మా! (అని చిఱునవ్వుతో వెనుకకుఁజూచి) ఏది లలిత? ఎప్పుడు లేచిపోయెను?

"పెండ్లిమాట రాఁగానే పాఱిపోయినది" అని చంద్రశేఖ రము బదులు చెప్పెను.

దామోదరుఁడు గంభీరముగ నిట్లనియెను! "అవును.. పాఱి పోదా? నూఱనుడు, వేయి యనుడు—జ్ఞానము వచ్చిన పిల్ల

కదా! (గిరీశుని సంబోధించి) నాయనా! (నిట్టూర్పువిడి) రమాశారద లిరువురు కలసి వసుమతీవలయమున మా లలిత నవతరించిరి. కానిచో మా కిట్టి మాణిక్యము లభించునా? తపము లాచరించినఁగాని దొరకదు.

దామోదరుఁ డిట్లు వచించుచుండ నతని శీర్ణకృశానన ముపై గభీరానురాగస్నిగ్ధమధురఛాయ కానవయ్యెను. దానిని విలోకించి చంద్రశేఖర గిరీశు లిర్వురు భక్తిపురస్సరముగ దామోదరునకుఁ దమచిత్తములందుఁ బ్రణమిల్లకుండ నుండఁ జాలక పోయిరి.

## ౭

మామ విశ్రామమందిరమునుండి మెల్లగఁ జాఱిపోయి వచ్చిన లలిత పావగదిఁ జొచ్చి, యతని శుభ్రాంబరములఁ బొందికగ మడతఁబెట్టి పెట్టెలోఁ బెట్టుచుండ నింతలోఁ జంద్రశేఖరము ప్రవేశించెను. ఆతనిఁగాంచి భయలజ్జావిస్మయములు గదురుకొన లలిత మోమువంచి నిలువం బడిపోయెను.

వ్యాజ్యమునందు సర్వస్వము గోల్పోయి న్యాయస్థానము నుండి యీ వలి కరుదెంచు నిర్భాగ్యుని మోము ట్లొకపూటలోనే, గుఱుతింపఁజాలని విత్తంబున్నఁ బరివర్తనముగునో — అట్లే చిరపరిచితమైన లలితచే గుఱుతింపఁ బడఁజాలని తెఱఁగున

నొక్క ఘడియలోఁ జంద్రశేఖరుని ముఖము మాఱిపోయెను. అతని ముఖమండలమున నిరాశా చిహ్నములు విస్పష్టముగఁ గన్పట్టుచుండెను.

చంద్ర—(శుష్కస్వరమున)—లలితా! ఏమి చేయుచున్నావు?

లలిత యా ప్రశ్న కుత్తరమొసఁగక సమీపమున కరుదెంచి, తన కోమలకర పల్లవములందు బావ హస్తనాళీకములఁ గైకొని, డగ్గుత్తికతో "బావా! ఏమట్లుంటివి?" అని ప్రశ్నించెను.

"ఏమి—ఎట్లుంటిని? నాకేమి? ఎప్పటివలె కుశలముగనే యుంటిని" అని చంద్రశేఖరమతి కష్టమున జిఱునవ్వు నవ్వెను.

కుసుమ సమకోమలములైన లలిత కరముల స్పర్శచేత నాతని వదనమండలమునఁ గొంచెక సజీవత మరల జూపట్టెను. నికటస్థతల్పముపై నొరగిలఁబడి లలిత నుద్దేశించి "చిన్నారీ! ఏమిచేయుచుంటివి? అని యాతఁడు మరల బ్రశ్నించెను.

లలిత—చలికోటును పెట్టెలో వేయమఱచితిని. దానిని కూడ నీ బట్టలలో సర్దుటకై వచ్చితిని. క్రిందటిమాఱు మన మందఱము విశాఖపట్టణ మరుగునపుడు, చలికాలమగుటచే రైలులో నీవు చాల కష్టపడిపోతివి. అందమగుకోటు లెన్ని యున్నను చలి నాపఁగల పెద్దకోటొక్కటి నీకు లేవందున తిరిగి రాగానే మనదర్జీవానితో ఈ చలికోటు కుట్టించితిని.

అని కడునుత్సాహముతో నిడివిపాటి కోటు నొకదానిని

బెటికనుండి పైకిఁదీసి లలిత బావకడ దాని నుంచెను.

చంద్రశేఖరము దానిఁ దీసి పరీక్షించి "నాకుఁ జెప్పలే దేమి?" యని ప్రశ్నించెను.

మందహాస చంద్రకళ నాయాగారమం దంతటఁ బ్రసరింపఁ జేయుచు లలిత "బావా! నీవు నవనాగరకుఁడవు. పట్టుపుట్టములే కాని, నీ కిట్టి బట్టలు గిట్టవు. నీతోఁ జెప్పినయెడల దీనిని నీవు కుట్టింపనిత్తువా? అందుచే నీకుఁ దెలుపకుండ నేనే నీపనిఁ జేయించితి" నని "సరిగ పైన నుంచితిని. మూఁతఁ దీయగనే కాన్పించును. చలివేసినపుడు తొడుగుకొనుట మఱువకు సుమీ" యనెను.

"మంచి" దని చంద్రశేఖరము నిర్నిమేషనేత్రుఁడై లలిత ముఖసరోజమును వీక్షించుచు, నేదియో యోజించుకొనుచు క్షణానంతరమున నాకస్మికముగ "కాదు!—కాదు!—అట్లు కానేరదు. నా వస్తువును మఱొక్కఁడు—" అని నాలుక గఱచుకొని యూరకుండెను.

లలిత—ఏమి కానేరదు?—నీ వస్తువును మఱొక్కఁడు కొనిపోఁజాలఁడనియేనా యనుచుంటివి. పెట్టెయం దుంచి తాళమువేసిన పిదప కోటు నెవరు దొంగిలింపఁగలరు?

చంద్ర—(తొట్రుపాటున)—కాదు!—కాదు!—ఆ మాట కాదు! అది మఱొక విషయము!—మంచిది, దాని కేమి కాని, లలితా! అత్త తన సామాను సర్దుకొనెనో లేదో యెఱుఁగుదువా?

లలిత—నేనే మధ్యాహ్న సమయమున సర్దితిని.

లలిత మఱొకమాఱు పేటికయందలి వస్తువులను బాగుగఁ బరీక్షించి బీగము వైచెను.

చంద్ర—(కొంచెముసేపు తాళి)—లలితా! రాఁబోవు వత్సరమున నాదినము లెట్లుండునో చెప్పఁగలవా?

లలిత—నీ దినముల కేమి—బాగుగనే యుండును—ఏమ ట్లడుగుచుంటివి?

చంద్ర—ఎందుల కడుగుచుంటినో నేను మాత్రమే యెఱుంగుదును. ఆవ్యథ—

అని యేమో చెప్పఁబోవుచు, చివాలున ప్రసంగము మార్చి, శుష్కస్వరముతో "కాని, లలితా! అత్తవారింటికిఁ బోవకము న్నెచ్చటెచట నేమేమి వస్తువు లున్నవో నాకు జూపి మఱి పొమ్ము సుమీ!—లేకున్న గావలసిన సమయమునఁ దేనిని కన్గొనఁ జాలకుందు" ననెను.

లలిత కినిసి—"పో!—" అనియెను.

ఇప్పటికిఁ జంద్రశేఖరము చిఱునవ్వు నవ్వగలిగెను. ప్రేమ చిల్కుపల్కుల నా యాఁవనుఁ డి ట్లనెను. "పోయెద్దవని యెఱుంగుదును. కాని, లలితా! నీవు నిజముగ నన్ను వీడిపోయిన యెడల, ఇచట నాపని యేమి కావలసియున్నది? నా కేకొదువ లేకున్నను, ఒక యమూల్యవస్తువు కొదువ యగును."

లలిత—ఆ యమూల్యవస్తు వేమి?

చంద్ర—ఏమైన నేమిలే నా కున్నదానిని నేఁ జక్కఁబెట్టు

కొను టెటుంగను. ఆపని పరిచారకులవలనఁ గానేరదు—అందుచే వేషవిన్యాసములను పరిత్యజించుకొని నీ మేనమామవలెఁ దయారు కావలెనేమో యని యిప్పటినుండి యోజించుచుంటిని. ఒక్క ముదుగు కట్టుగుడ్డ, ఒక ప్రాతకండువాతోఁ గాలము పుచ్చవలయును—కానున్నది కాక తీరదుకదా! ఇఁక, లలితా!' యని పిలచిన నీవు కినియుదువు కాఁబోలు—అయితే లలితాంబగారూ! అత్తవారింటి కరిగిన యనంతరము బావను పూర్తిగ మఱచిపోదురా యేమి?

బీగములగుత్తెను బాన్సుపైఁ బడవైచి, లలిత వెలుపలికిఁ బర్వెత్తుకొనిపోయెను.

"రేపటియుదయ మొకసారి కనిపింపు" మని చంద్రశేఖరము లోపలినుండి కేకవైచెను.

బావమాట కుత్తర మొసఁగక, విననిదాని లీల ద్రుతపదయై లలిత సౌధసోపానములనుండి రెండవయంతస్తుపైకరుదెంచి, యందుండి తన మామ యిల్లు జొచ్చెను. తమ మేడడాబాపై నొకమూల నన్నపూర్ణ నతవదనయై యుపవసించి, రేవెలుంగులో మందారపూలమాలను గ్రుచ్చుచుండెను. లలిత యామెకడ కరిగి "మంచులోఁ గూర్చుండి యేమి చేయుచున్నావే!" యని ప్రశ్నించెను.

అన్నపూర్ణ (శిరమెత్తి)—దండ గ్రుచ్చుచున్నాను—ఈవేళరాత్రి నాపిల్ల* పెళ్లి!

లలిత—అయిన వదినెతోఁ జెప్పకుండనే పిల్ల పెళ్లిఁ జేయఁ

దలఁచుచున్నావా?

అన్నపూర్ణ—వదినా! పెళ్ళి స్థిరమగుటకే తాతలు దిగి వచ్చిరి. లగ్నము కుదురగ కొట్టుమిట్టు లాడిపోతిని. చెప్పు లలోఁ గాళ్లుపెట్టుకొని శుభ కార్యము చేయవలసివచ్చుచున్నది. ఇంతకుముందే బాబయ్య పంచాంగము చూచి 'అమ్మా! ఈరాత్రి తప్పినయెడల నీమాసములో నిఁక ముహూర్తములు లే' వన్నాడు. పిల్ల యెదిగి కూర్చున్నది. ఇంకను ఎన్నాళ్లు కూర్చుండఁబెట్టుకొని యుందును? ఇప్పటి కప్పుడే నలుగురు మూతులు, ముక్కులు విఱుచుకొనుట మొదలుపెట్టిరి. ఎట్లో ముడిపెట్టి పిల్లకు కన్నెచెఱ తప్పించుద మనుకొనుచుంటిని—వదినా! రెండురూపాయ లియ్యవమ్మా నాకు. వచ్చే పెళ్ళి వారికి ఫలహారములను పెట్టకపోయిన ఏమివాదు వేయుదురో! ఎంత చెప్పినను, మొగపెళ్ళివారుకదా—యేదో వంక చూపు చునే యుందురు. నా శాయశక్తుల వారి మనస్సు తృప్తిపరచ వలెననియే అనుకొనుచున్నాను. పిల్ల అదృష్టము; మంచి వాఁడే దొరకినాడు వదినా!

బొమ్మలపెండ్లి సేయ సిద్ధపడిన యన్నపూర్ణయొక్క పెద్ద కబురులను విని లలిత నవ్వి "పాపము రూపాయలు కావలసి నపుడు వదినె జ్ఞాపకము వచ్చును కాఁబోలు! పెద్దదాననని చెప్పి పెండ్లికిఁ బిలిచిన పుణ్యమునకుఁ బోతివా?—పోయి నా బాలీసుక్రింద నున్న పైకముఁ దెచ్చుకొమ్మ. అయిన అన్నపూర్ణా! పూలదండతో వివాహము జరగిపోవునా?"

యనెను.

గభీరవదనయై యన్నపూర్ణ—"ఎందుకు జరుగదు? వదినా! నీ వేమియు తెలియని మూర్ఖురాలకుఁ జెప్పినట్లు చెప్పు చున్నావు. నా చేతిమీఁదుగా నేనెన్నో కార్యములు చేసితిని. అవన్నియు నీవు చూచితివా, చేసితివా? పూలమాలతో వివాహ మెట్లగునో యిపుడే చూచెదవుగానిలే. కొంచె మోపిక పట్టుము. లగ్నము సమీపించినది" అని ఫలహారము లను తెప్పింపఁ గ్రింది కరిగెను.

లలిత యందే యుపవిష్టయై దండ గ్రుచ్చసాగెను.

కొంతసే పైనపిదప అన్నపూర్ణ తిరిగివచ్చి "వదినా! మనవాళ్ళనందఱిని పిలుచు టయినది. అన్నయ్యతో మాత్రము చెప్పలేదు. పోయి చెప్పి వచ్చెదను. లేనిచో 'చూచితిరా? మా అన్నమ్మబిడ్డ పెండ్లి చేసికొని నన్ను పిలవనే పిల్వలే'దని పదుగురముందు నాపై నెపమువేయక మానడు. ఆతని మనసు కించిపఱచు టెందులకు? నేను నిందపడుట యెందుకు? పోయి పిలుచుకువచ్చెదను" అని గబగబ వారి సౌధములోని కరిగెను.

అన్నపూర్ణ కొంతసేపటికి మరలివచ్చి యిట్లనెను "వదినా! అన్నయ్యకు ఒక పూలదండ కావలెనటే—ఒకమాఱు వెళ్లి యీ దండ యిచ్చిరావూ? ఇచ్చి కబుర్లు చెప్పుకొనుచు కూర్చుండక, త్వరగా రా! నేనీలోపున మఱియొకదండ గ్రుచ్చి పెండ్లి పీటలు వేసి మండపముదగ్గఱ కావలసిన సరంజాము

చేర్చియుంచెదను. లగ్నసమయమున కిక ఎంతయో ఆల స్యములేదు"

శిరము పంకించి లలిత "అన్నమ్మా! నేను వెళ్లలేనే! నీవే వెళ్ళి యిచ్చి రా" అనెను.

"మంచిది. ఇన్నిమాటలు విని యిదేనా చెప్పెదవు? ఒక మాఱు వెళ్లి వచ్చినయెడల అరిగిపోవుదువు కాబోలు. రాణి వాసపుబిడ్డవు. పోనిమ్మా. నీ యింట్లోకూడ ఇఁక కార్యములు కథలు రావా యేమి? అపుడు నే నెక్కడకు పోయెదను? నేనే వెళ్ళి యిచ్చి వచ్చెదను. అదిగో! ఆపెద్ద దండయిమ్మా" అని అన్నపూర్ణ చేయి జాపెను.

లలిత దండను గరమునఁ గైకొని దాని నన్నపూర్ణ కీయ బోయి మరల నేమనుకొనెనో కాని, "పోనిమ్మా. నేనే యిచ్చి వచ్చెదనులే! ఇచ్చుటిపను లేమో నీవు చక్కఁబెట్టుకొమ్మా" అనియెను.

గభీరవదనయై, యన్నపూర్ణ "అట్లైన ఇచ్చిరమ్మా వదినా! నాకు చేతినిండా పనియున్నది—ఊపిరిసలుపకుండ ఉన్నాను" అనెను.

అన్నపూర్ణ ముఖభాగమును, వాగ్భంగిని విలోకించి, లలిత కిలకిల నవ్వి "ఆరితేరిన అవ్వ వయిపోయితి" వని మాలను కేలఁగైకొని నిష్క్రమించెను.

ఆమె బావ గదికవాటముకడ కరిగి లోనికిఁ దొంగి చూచెను. ఏకాగ్రచిత్తుఁడై యతఁ డేదియో యుత్తరము

వ్రాయుచుండెను. లలిత మెల్లగఁ దలుపుఁ దెఱచి లోని కరిగి కుర్చీపైఁ గూర్చుండియున్న బావవెనుక కరిగి నిలువంబడెను. అప్పుడుకూడ జంద్రశేఖరము ప్రక్కకుఁగాని, వెనుకకుఁగాని తిరిగి చూడలేదు. క్షణకాల మట్లే స్తబ్ధయై, నిలువంబడి, బావను చకితుసేయ నుద్దేశించి, లలిత తన కేలగల లలిత సుమదామము నాకస్మికముగఁ జంద్రశేఖరునిఁ కంఠసీమఁ బడ వైచి చివాలున నేలపైఁ గూర్చుండెను.

పుష్పహార మకస్మాత్తుగ నిజగళమునఁ బడినంతనే లలిత యభిలషించినట్లు చంద్రశేఖరము చకితుఁడై "ఇదేమి? అన్న పూర్ణా!" అని తోడనే వెనుకకుఁ జూచి కిలకిల నవ్వుచున్న లలితను విలోకించి కను గంభీరుఁడై "లలితా! ఎంతపని చేసితివి?" యనెను.

లలిత లేచి నిలువంబడ, బావముఖ మవలోకించి, యొకిం చుక వెఱగంది ఏమి!—ఏమి చేసితిని? మాలవేసితి నంతియే గదా?" యనెను.

ముఖమందలి గాంభీర్యభావము నట్టులే నిలిపి చంద్రశేఖ రము "అంతియేనాయని యనివైచితివి. దాని యర్థ మేమో యెఱుఁగవా? గంఠమునఁ బూలహారము వైచిన, నేమో అన్నపూర్ణ నొకమా ఱడిగి రమ్మ" అనియెను.

తన చెయిదముయొక్క యర్థ మేమో లలిత యిపుడు గ్రహించెను. నిమేషమాత్రమున నామె ముఖనీరజ మంతయు ననిర్వచనీయమైన బిడియముచే నెఱ్ఱనై పోయెను. "చాలులే!

చాలులే!" అనుచు లలిత ద్రుతగతి నా యాగారమునుండి బాహిరమున కరిగెను.

గృహాంతరమునుండి చంద్రశేఖరము "లలితా! పోకుము! పోకుము! మాట విని పొమ్మ—చాల పనియున్నది" అని కేకవైచెను.

బావపల్కు లామె వీనులఁబడియెను. కాని, లలిత వానిని వినిపించుకొనక, యెందును నాగక, ద్రుతపదయై నిజాలయముఁ జొచ్చి, శయ్యపైఁ బడియెను.

ఇప్పటికై దాఱువత్సరములనుండి రేఁబవలు లామె చంద్రశేఖరుని వెన్నంటి యతని నీడవలెనున్నది. కాని, యెన్నఁడును నాతని ముఖమునుండి యిట్టి నుడువులు వెల్వడు టామె విని యుండలేదు. గంభీరప్రకృతిఁగల చంద్రశేఖర మొకప్పుడు గూడ నామెను బరిహసించువాఁడు కాఁడు. ఒకవేళ పరిహసించినను, నిట్టి యనిర్వాచ్యలజ్జాకర వ్యంగభాషణము లాతని ముఖవినిర్గతము కాలేదు. సిగ్గుచే సంకుచితయైన లలిత కొంచొకసే పట్టె తల్పమున శయనించియుండి యనంతరము లేచి కూర్చుండెను. బావకడ నెంత చనువున్నను నతఁ డనిన లలిత గడగడ లాఁడుచుండును. చాల పని యున్నదని యాతఁడు కేకవైచెను 'పోదునా? పోకుందునా?' యని యా పర్యంకముపై నుపవసించి యోజింపఁదొడంగెను. అపు డా మేడయందుఁ బనిచేయు పరిచారిక కేక లలితకుఁ గర్ణగోచర మాయెను. "ఏమమ్మా లలితమ్మగారూ! ఎక్కడమ్మా! చిన్న

బాబయ్యగా రొక్కసారి రమ్మంటున్నారు."

లలిత మెల్లగఁ బాన్పుపైనుండి దిగి, వెలుపలి కరిగి, మృదుస్వరమున "మెల్లగా చెప్పలేవూ? ఎందు కా పెద బొబ్బలు? వచ్చుచున్నాను. నీవు వెళ్లుము" అని బావ గది కడ కరగి, కవాటముగుండా లోనికిఁ దొంగిచూచెను. చంద్రశేఖర మప్పుడుకూడ కమ్మ వ్రాయుచుండెను. కొండొకవడి యట్లే నిలువంబడియుండి, లలిత మెల్లనిస్వరమున "ఎందుకు బావా?" యనియెను.

చంద్రశేఖరము—(ఉత్తరము వ్రాయుచు శిరమెత్తక)—దగ్గఱకు రా—చెప్పెదను.

లలిత—నేను రాను. ఇచ్చటినుండియే విందును. ఎందులకో చెప్పుము.

చంద్ర—(శిరము వాంచియే, సస్మితవదనసరోజుండై)—లలితా? ఏమియు నెఱుగనిదానివలె వచ్చి అకస్మాత్తుగ నెంతపనిఁ జేసితివే!

లలిత—(క్రోధస్వరమున)—పో!—మరల నదే!

చంద్ర—(శిర మెత్తి లలితను విలోకించి, మందస్మితముఖుఁడై)—నా దోష మేమి? కావించినదేమో నీవే కదా?—

"నే నేమియు జేయలేదు—నీవు నా దండ నా కిచ్చివేయుము."

"దాని నిచ్చివేయుటకే పిలచితిని. దగ్గఱకు రమ్ము. నీ

దండ నీ కిచ్చివేయుదును. నీవు సగముఁ గావించి యరిగితివి. ముందుకు రమ్ము. శేషించిన సగము నే నొనరించి, సంపూర్ణముఁ గావించెదను."

లలిత మౌనముతో ద్వారాంతరాళమున క్షణకాలము నిలచియుండి "నీకు నిజముగాఁ జెప్పుచుంటిని. నాతో నట్టి పరిహాసముఁ జేసితి వేని, నే నిఁ కెప్పుడు నీకడకు రాను—ఇట్లని ముమ్మాటికిని నమ్ముము. ఇప్పుడైనను, నా మందారమాల నా కిచ్చివేయుము" అనెను.

గ్రీవాలనున్న కుసుమమాల్యముఁ బైకెత్తి దాని నామెకు జూపి "ఇదిగో! కొని పొ"మ్మని చంద్రశేఖర మనెను.

"అచటినుండిగి రవాటువేయుము."

చంద్ర—(తల వంకించి)—లలితా! నీయాటలు నా యొద్ద సాగిరావు—దగ్గఱకు రానిచో దండ దొరకదు.

"అట్లైన నా కాదండ యక్కఱనే లే" దని, కినిసి లలిత యటనుండి వెడలిపోయెను.

"సగము మాత్రమే కానిచ్చితివి. శేషించిన—" అని చంద్రశేఖరము లోపలినుండి పల్కుట విని లలిత "కానిచ్చిన కానిచ్చితినిలే!" యని కడు కుపితయై వెడలిపోయెను.

కాని లలిత క్రిందికి పోలేదు. తూర్పువైపున గల డాబా మీఁది కరిగి దాని యంచున గల యినుపగ్రాది నానుకొని యూర్ధ్వముఖయై నిలువంబడెను.

తనచంద్రికా చందనముచే యామినీ సీమంతిని మేనం

తీయు నలంది పరమ పరితోషమున నవ్వుచు శరత్కాల రాకాసుధాకరుఁ డపుడభ్రభసీమఁదోఁచెను. ఉడుపతి యుద్దేశ ముల కనవగతములుకాని దిగంతములుకూడ హాసనమొనరిం చుచు జాబిల్లి జాడల నుపలక్షించుచుండెను. రజనీ రమణికి మఱింత హాయిఁగొల్పఁగాఁబో లామె యంగ ప్రత్యంగములు నంటియున్న జ్యోత్స్నా విలేపనముపై పవనుఁడల్ల నల్లన గంతులిడుచుఁ దన్నుఁగాంచి, విరహులు సిగ్గు వడుదురని యదృశ్యుఁడై యుండె. ఆహా! రేలతాంగింగూడి శార్వరీ వల్లభుఁడు సలుపు శృంగారఖేలనముఁగాంచి, పులకితాంగులై పరస్పర భుజ మృణాళ వేష్టనలుకాఁగోరని సతీపతు లెవ్వ రుందురు?

లలిత యొకమాఱు శేఖరుని గేహాచూడపైఁ దనచూ డ్కుల నిగుడించి, పదపడి నిర్మల వియత్తలమునకు మరల నాదృక్కులఁద్రిప్పెను. అనిర్వచనీయమగు లజ్జచే నపుడామె కనుదమ్ములు జ్వలింపసాగెను. అభిమానము కతన నాననఁ బోఁడి నేత్రసరోజములనుండి యశ్రువారి యవారిగ నొరఁగ దొడంగెను. చంద్రశేఖరముఖవినిర్గతములైన వాక్కుల హృద యంగమముఁ గావించుకొనఁ జాలకుండుట కామె యంత బాలికకాదు. అట్లయ్యు, నతఁడేల నట్టి మర్మాంతిక హాస్య మొనరింప సాహసించెను! ఈవిషయమెట్టి లజ్జాకరమైనదో గ్రహించుటకు వలయు వయసామెకువచ్చెను. తా ననాధయగు టంజేసి యెల్లరు తనయెడ జాలిబూని యుందురని యామె

యెఱుంగును! తన దుస్థితిఁగాంచి భువనేశ్వరీ చంద్రశేఖరులు శైశవమాది దన్నల్లారుముద్దుగఁ బ్రేమించుచుండిరని కూడ నెఱుంగును. తన నిస్సహాయతకు జాలివడి తన్నెన్నఁడుఁ గనివిని యెఱుఁగని క్రొత్తమానిసి యొకఁడు తన్నుద్ధరింప నడుముఁ గట్టియుండెననికూడ నామె యెఱుంగును. ఇన్నియు నెఱిఁగిన నాయబలయొక్క యవస్థ యెట్టిచింత కాలవాలమై యుండునో వేఱుగ వివరింపఁబనిలేదు.

నిమీలిత నేత్రయై నిలిచియున్న యారాజానన స్వాంతమున భావస్రోతము కడువడిగఁ బ్రవహింపఁదొడఁగెను. కలకత్తా మహానగరమునఁ దోడి సమాజమున నిప్పచ్చరనిపీడితుఁడగు తనమాతులయు, నమేయార్థ సంపన్నుఁడైన తన బావయు, నెట్లు సంభావింపఁ బడుచుండిరో, దామోదర చంద్రశేఖరుల స్థితిగతుల నడుమనెట్టి గభీర వ్యవధానముండెనో నాప్రాయవతి కవగతముగాకపోలేదు. అట్టి కటికిదరిద్రు నాశ్రయించి, ఆతని గళగ్రహియైనఁ దనవంటి నిర్భాగ్యురాలికిని చంద్రశేఖరునికిని నెట్టి ప్రభేదమున్నదో నా సంప్రాప్తయౌవన గ్రహించెను. అట్టివానికిని తనకును దాంపత్య మలవడునని లలితయెట్లు ప్రత్యాశించును?

ఒకవేళ నట్టి పేరాస యామెయెడఁద యం దడంగియుండినను, చంద్రశేఖరుని వివాహప్రయత్నము లన్యత్ర జరగుచుండుట గాంచినంతనే యది యంతరింపకుండునా? ధనకాంతాపరుఁడగు శ్యామసుందరుఁడు కట్నమ పేక్షింపక

యొక్క పేదవారి బాలికను కోడలిగఁ బరిగ్రహించునని యోజించుట గగనకుసుమము నపేక్షించుట కాదా? చంద్రశేఖరుని యైశ్వర్యముతో సమముగఁ దులఁదూగు నొకరి కొమార్తెకు నాతనికిఁ బరిణయము స్థిరమగుచుండుట లలిత యెఱుంగదా? నేఁడు కాకున్న నెల్లియైన, చంద్రశేఖరుఁ డన్యాంగన పతి యగుట నిక్కమని యామె యిన్న గ్రహింపలేదా? ఆ పెండ్లి సమయమున బహు సహస్రరూప్యములు శ్యామసుందరుని బొక్కసముఁ జొచ్చి యతని దురాశానలమునకు సమిధ లగు నని చిన్నారి వినియుండలేదా? పెండ్లికూతురు జనకుఁడు తన యేకాత్మజయుద్వాహమును మహావైభవమునఁగావించు ననియు, దాము కావింపు సన్నాహములఁ దాము సలుపు చుంటిమనియు, బల్లోరకడ భువనేశ్వరి పల్కిన పల్కులా పయోజాస్య శ్రవణగోచరములు కాలేదా? ఇవన్నియు సెవు లార వినుచు, గనులారఁ గనుచున్న లలితను జంద్రశేఖర మేలు నాకస్మికముగ నాడిన మట్లవమానపఱుప సాహసించెను?

సమ్ముఖమునఁ దోఁచు స్వచ్ఛవిహాయసముపైఁ దన శూన్యదృక్కుల నిగుడించుచు, నిశ్చేతంగున లలిత చింతాల హారినిమునింగియుండి, హఠాత్తుగఁ జకితయై వెనకకు ముఖము ద్రిప్పిచూడఁ జంద్రశేఖర మటనిలచి, మందహాసము గావించు చుండెను. ఇంతకుముందు దామె యేవిధమునఁ బూలమాల నాతని కంధరసీమఁబడవైచెనో, యావిధంబుననే యామాల్య

మాతరుణవయస్కుని కరములనుండి యదుదెంచి, యా జవ్వని కంఠసీమఁ బడియెను! నిజగళదేశమునఁ గ్రాలు ప్రసవదామము గాంచి లలిత నిర్విణ్ణయైపోయెను! అంతరంగమునుండి పొంగి పొరలువచ్చు దుఃఖముచే జిన్నారి కంఠము రుద్ధము కాఁజొచ్చెను. అయినను నతిప్రయత్న మొనర్చి యామె డగ్గుత్తికతో "ఎందు కిట్లొనరించితివి?" అని బావ నడిగెను.

చంద్ర—నీ వెందుల కొనరించితివి?

"నే నేమియు నొనరింపలే"దని లలిత నిజగళమునుండి మందారమాల్యము నూడదెలికి దానిపైఁ గర మిడి, నాక స్మికముగ బావచక్షుల వీక్షించి యూరకుండెను. దండను త్రెంపివేయుట కామెకు సాహసము చాలలేదు. కాని గద్గద స్వరమున నామె "నా కెవరును లేరని నన్నిట్లవమానపఱచి తివి! దిక్కుమాలిన పక్షిని కావున నీ విట్లు సాహసించితివి" అనెను.

చంద్రశేఖర మింతదనుక మందహాస మొనరించు చుండెను. లలితపల్కులను విని యతఁడు నిర్విణ్ణుడై పోయెను. అది బాలిక యాడుమాటకాదు. పిన్నదనపు టూ_క్తికాదు. "నేను నిన్నవమానపఱచితినా? నన్ను నీవే యవమానపఱచితివా!" యని చంద్రశేఖరుఁడు ప్రశ్నించెను.

నయనములనుండి దొరఁగు బాష్పాంబువులను దుడచి కొనుచు, భయముతో నామె "నీకు నేను గావించిన యవ

మాన మేమి ?" అనెను.

క్షణకాల మేమియుఁబలుకక పదపడి "ఒకించుక యోజిం
చినయెడల నీకే తెలియును. లలితా ! ఈనడుమ నీ వొకిం
చుక తలబిరుసుతనము చూపుచుంటివి. నేను విశాఖపట్టణము
నకుఁ బోవుటకు ముందుగా నందుకై నీచేఁ దగు నౌషధ
సేవనము చేయింతునుసుమీ !" అని చంద్రశేఖర మూర
కుండెను.

లలిత యిఁకేమియు బ్రత్యుత్తర మీయఁజాలకపోయెను.
నతముఖయై నిలువంబడియుండెను! పరిపూర్ణ జ్యోత్స్నాతల
మున నిరువురు స్తబ్ధులై యుండిరి. క్రిందనుండి యన్నపూర్ణ
యొక్కబిడ్డ వివాహశంఖానినదము మాత్రము వినవచ్చు
చుండెను.

కించిత్కాలము మౌన మూనియుండి, చంద్రశేఖరుఁడు
"ఇఁక మంచులో నిలచియుండుటేల ?. క్రింది కరుగు"
మనెను.

"పోయెద" నని లలిత యప్పుడు బావ మ్రోల సాగిలఁబడి,
యతని చరణసరోజములను నిజనయనాంబుజములచే స్పృశిం
చుచు నిటలతటఘటితాంజలియై భక్తిపురస్సరముగ నతినిఁ
బ్రణమిల్లి నయనంతరము మెల్లగ లేచి మోమున నునుసిగ్గు
దోపఁ దనువు పులకింప సహజస్వాదుభాషణంబుల నల్లన
"బావా ! ఇఁక నే నేమి చేయవలయునో చెప్పి పొ"మ్మని
యెను.

చంద్రశేఖరము ముఖమండలము మందహాస మండనాయమానమై పోయెను. ఒకించుక తాళి, తదుపరి ప్రసారిత హస్తయుగళుండై, లావణ్యాంబురాశియై నవయౌవనమయూఖల సీను లలితయొక్క లలిత తనుల్లతాంసభుజావల్లియందుబంధించి యా పల్లవాంఘ్రి యధరమును నిజోష్ఠాధరములచే స్పృశించి చలచంద్రికలు నగచంద్రశేఖరుండా చంద్రానన యధర సుధను గనివితీఱం గ్రోలి, ప్రేమసుధనిజవాక్కుల వెల్వడం దన మురిపములవొంతి నుద్దేశించి "లలితా నేనిక నీకేమియుం జెప్పనక్కఱలేదు. నేటినుండి నీయంత నీకే యంతయుం దెల్లము"ననెను.

లలిత సర్వాంగములు రోమహర్షణములై పోయెను. వాతవితాడితవేతసీలతవోలె నా లతాంగి కంపింపదొడంగెను. ప్రక్కకొత్తిగిలి "బావా! నేనాకస్మికముగ నీ కంఠమునం బ్రసూనమాల వైచినందులకా నీ విట్లు కావించి"తని నునుసిగ్గుతో మొగమోరంజేసికొనెను.

మందస్మితముఖమండలుండై శిర మూపి చంద్రశేఖరము "అర్థాంగీ! అందులకు కాదు. చాలదినములనుండి నేను యోచించుచునేయుంటిని. కాని స్థిరమతిని గాంజాలకపోతిని. నేడు స్థిర మొనరింపంజాలితిని. యేలనన, నిన్ను వీడియుండ నేరనని నేడే బాగుగ గ్రహింపంగలిగితి"ననియెను.

"కాని, బావా! నీయయ్య వినినయెడల కోపింపడా? అమ్మ వినిన దుఃఖింపదా?—ఇంక వెరవేది!—"

"మామయ్య వినినయెడల కోపించుట నిజమే కాని అమ్మ పరమానంద భరితయగును. వారిక నెట్లనుకొన్నను, అనుకొన నిమ్ము. జరుగదలచినది జరగిపోయినది. ఇఁకఁ గ్రిందికరిగి మాతకుఁ బ్రణమిల్లుము—ఈ యనుబంధమునుండి నీవు వీడి పోఁజాలవు; నేనును వీడి పోఁజాలను! ప్రేయసీ! ఈదండ ఆట వస్తువు కాదు—పెండ్లిదండ!"

౮

మూఁడునాలుగు మాసములు గడచిన వెనుక నొకనాఁడు దామోదరుఁడు మ్లానముఖుఁడై శ్యామసుందరుని యాలయముఁ జొచ్చి, యతని సమీపమునఁ గుర్చీపైఁ గూర్చుండ నుద్యమించెను. అపుడు శ్యామసుందరుఁడు రోషకషాయిత నేత్రుఁడై "అదేమి! ఇచట నుపవిష్టుఁడ వగుచుంటివి! లే లెమ్ము! అదిగో! ఆమూల చాపపైఁ జతికిలఁబడుము. వేళ కానివేళ నేను స్నానముచేసి తంటాలు పడలేను.—కులములో వెలియైతివి కాదా?" యనెను.

దామోదరుఁ డేమియు పలుకక శ్యామసుందరుని నిర్దేశానుసారము మూలకరిగి చాపపైఁ జతికిలపడి తల వంచుకొని యెను. మూఁడునాల్గు దినములకు మున్నాతఁడు యథారీతి దీక్షగైకొని బ్రహ్మసమాజమతమును స్వీకరించెను. పలువు

రావార్త విని యనేకవిధములఁ జెప్పుకొనుచుండ శుద్ధశ్రోత్రియ హిందువగు శ్యామసుందరునకు శ్రవణగోచరమాయెను. పాపము దామోదరు డెవరియభిప్రాయముఁ గొనకయె యీపనిఁ గావించినదాదిగ నింట బయల్వెడలిన పోరునకును, రోదమునకును నంతము లేకుండెను.

శ్యామసుందరుఁడు తీక్ష్ణస్వరమున "ఏమోయీ! మతభ్రష్టుఁడవైనమాట నిజమేనా?" యని దామోదరు నడిగెను.

సజలనయనముల నొకించుక యెత్తి దామోదరుఁడు "చిత్తము—నిజమే నండి" అని హీనస్వరమున నుత్తరమొసఁగెను.

"ఇట్టి తుచ్ఛపుపని నేల గావించితి వోయి! పెద్దపోకిళ్లకుఁ బోవుద మనుకొంటివి గాబోలు! నెలకు ముట్టునవి మూఁడు దమ్మిడీలు లేవు; కాని నీతామసము—"

క్రోధముచే శ్యామసుందరుని నోటినుండి మాట వెల్వడలేదు.

దామోదరుఁడు నయనములఁ దుడిచికొనుచు, రుద్ధకంఠము నొకించుక సవరించుకొని "తెలిసినది కాదు అన్నా! దురంతమగు దుఃఖమును సహింపఁజాలక, కుత్తుకకు ఉరివోసికొందునా, లేక బ్రహ్మసమాజికుఁడ నగుదునా యని యోజించి యోజించి, చాలసేపటి వఱకు నేమియు నిశ్చయింపఁ జాలనైతిని, తుద కాత్మఘాత యొనర్చుకొన సాహసింపలేక బ్రహ్మమతమునఁ జేరుటయే మంచిదని యట్లు

కావించితిని" అని పలికి నేత్రయుగమునుండి యవారిగ స్రవించు అశ్రుస్రవంతి నరిఁగట్ట యత్నించుచు వెలుపలికి వెడలిపోయెను.

శ్యామసుం—(పెద్దగొంతుతో)—మంచిపని జేసితివి! నీకంఠమున కురి దగుల్చుకొనుట చేతగాక జాతికంఠమునఁ దగిల్చితివి. మంచి దీక్ష పొమ్ము. మరల నీపాడుమొగము నాకుఁ జూపకుము. మతమును జెఱుపఁ గ్రొత్తగా బయల్వెడలిన ప్రబుద్ధుల నాశ్రయించుకొని, వారి యుచ్ఛిష్టమును భుజింపుము!—ఇంటనున్న యాడుబిడ్డలను మాలమాదిగలకుఁ గట్టబెట్టు గతియే నీకుఁ బ్రాప్తించినది. తుచ్ఛుఁడా!—

ఇంకను నతఁ డేమియో యనఁబోవుచు, దామోదరుఁడు కను మఱుఁగగుటచే నంతటితోఁ జాలిగొని పటపట పండ్లు గొఱికెను. దామోదరుఁడు తన చేతినుండి పూర్తిగఁ దప్పిపోయి యుండుటచేఁ దానేమియుఁ జేయఁజాలకున్నందులకతఁ డెంతయో విచారించెను. ఇఁకముందు గూడ నతఁడు తనఁ జేతఁ బడు నాన కన్పట్టుటలేదు—అందుచే శ్యామసుందరుఁడు నిష్ఫలాక్రోశవర్షము గురిపించివైచి, యానాఁడే పనివాండ్రను బిలిపించి, రెండవయంతస్థునందున్నట్టి యిరువురి గృహములవారు రాకపోకలు జరుపు మార్గమున కడ్డముగ నొక పెద్దగోడ పెట్టించెను.

బహుదూరమునఁ బ్రవాసము సేయు భువనేశ్వరి యీ వార్త చంద్రశేఖరునివలన విని, మిక్కిలి దుఃఖితయై, "నా

యనా! నీతండ్రి కీబుద్ధి యెట్లు పుట్టెను? దామోదరుఁడు మాత్ర మీ పాడుపని నెందుల కొనరించెను?" అనెను.

దామోదరుఁ డా 'పాడుపని' నెందుల కొనరించెనో చంద్రశేఖరుఁడు గ్రహింపఁజాలక పోలేదు. ఆ యాలోచన యతని కెవ రొసంగిరో కూడ నాతఁ డెఱుఁగకపోలేదు. కాని యా విషయ మేమియు నటఁ బ్రస్తావింపక యతఁ డిట్లనెను. "అమ్మా! అట్లాతఁ డాచరించెనని నీ వింత తొట్రుపడనేల? నేఁ డాతఁడు తనంతకుఁ దానే సంఘబహిర్భూతుఁడై నందుల కింత వగవనేల? మఱి కొలఁది దినములు గడచిన యనంతరము మీ రే యా నిర్భాగ్యుని వెలివేయ గడంగరా? అంతమంది యాఁడుబిడ్డల కాతఁడు మనువుల నెట్లు తేఁగలుఁగును?"

"నాయనా! ఎన్ని యనుకొన్నను, మనువులు రాక తప్పునా? వానికై జాతిఁ గోల్పోవవలయునన్నను కోల్పో వలెను! అయినను, పుట్టించినవాఁడు లేడా? దిక్కులేని దీను లకు దైవమే దిక్కు."

చంద్రశేఖర మేమియుఁ బలుక కూరకుండెను.

భువనేశ్వరి—(కండ్లు దుడుచుకొనుచు)—బిడ్డ లలితను వెంటఁ బెట్టుకొని వచ్చినయెడల, పాపము దానికి నే నేదేని తెలుక తెరువు జూపెడిదానను—చిన్ననాటనుండి దానిని గడుపునఁ బెట్టుకొని పెంచుచున్నాను. పాపము బిడ్డ యిప్పు డేమి యధోగతి పాలగునో కదా! ఈ యాలోచన లోపల నుంచుకొనియే దామోదరుఁడు దానిని పంపలేదని అప్పుడు

గ్రహింపలేకపోతిని. నిజముగ బిడ్డకై యాతఁడు వరుని వెత కుచు, పెండ్లిప్రయత్నముమీఁద నుండెనని యనుకొంటిని.

మాతవైపునకు దిరిగి, కొండొక లజ్జితభావమునఁ జంద్రశేఖరుఁ డిట్లనెను. "అమ్మా! నీయుద్దేశ మదియే యైన యెడల నిపు డింటికరిగి, చేయఁదలఁచిన దాని నేల చేయ కూడదు? లలిత యింకను బ్రహ్మసమాజమతములోఁ గలియ లేదు—ఆమె మాతుల కలిసిన నామె కేమి? కన్న తండ్రి యైన, నేమో యనుకొనవచ్చును. తలిదండ్రులు లేని దగుటచే, నాతని యింటఁ బెరిగినంతమాత్రమున నాతనితో నామె కూడ నేల వెలియగును?"

భువనే—(ఒకించుక యోజించి)—నాయనా! నీవనినది నిజమే. కాని, నీ తండ్రి స్వభావమెఱుఁగువా? ఆయన దేనికిని సమ్మతింపరు. వారి ముఖమైన నాయన జూడనిచ్చునని యనుకొనను.

చంద్రశేఖరుని మనసున గూడ నా తలంపే పీడించుచుండెను. ఆతఁ డేమియుఁ బలుకక వెలుపలికి వెడలిపోయెను.

ఇఁక నిముసమైన విశాఖపట్టణమున నుండుట కాతని చిత్తమొల్లకుండెను. రెండుమూఁడు దినములు కాలుగాలిన పిల్లి వలె నిటునటు దిరిగి, యాతఁ డొకనాఁటి సంధ్యాసమయమున జనని నుద్దేశించి "అమ్మా! ఇఁక నా కిచట నేమియుఁ దోఁచుటలేదు. ఇంటికిఁ బోవుదమా?" అనెను.

"అలాగే నడువుము నాయనా! నాకుఁగూడ నిందుబుసు

పోవుటలేదు. ప్రాణములన్నియు లలిత మీఁదనే యున్నవి."

మాతాపుత్రు లిరువురు నిజాలయమునకు మరలి యరుదెంచి చూచుసరికి మేడయంతస్తు నందుఁగల మార్గమున కడ్డముగ నొకకుడ్యము నిర్మింపఁబడి యుండెను. దామోదరునితో నెట్టిసంపర్కముండుట కాని, యాజాతిభ్రష్టునిఁ గన్నెత్తి చూచుటకాని యజమాని యభిమతము కాదని యెవ్వరి నడుగకుండనే వా రిరువురు గ్రహింపఁజాలిరి.

ఆ రాత్రి భువనేశ్వరి తనయుని కన్నము వడ్డించుచు మాటలసందర్భమునఁ దాసీ వఱలోఁ దలంచినట్లు లలితను గిరీశునకిచ్చి, పెండ్లి చేయవలె ననుమాటలు జరుగుచుండెనని యతనితో వాక్రుచ్చెను.

చంద్ర—(ముఖమెత్తక)—అమ్మా! అట్లని యెవరు చెప్పిరి?

భువ—లలిత మేనమామ. మధ్యాహ్నము మీ నాయన నిదురింపఁగనే నే నొక మాఱా యింటికిఁ బోయితిని. నన్నుఁ జూడఁగనే మఱఁది బావురుమని యేడ్చెను. ఎంత యోదార్చినను, పాపమా యమాయకుఁడు స్త్రీ వలె వాపోయెను.

చెప్పుచుండగ దుఃఖముచే నా యమకంఠము రుద్ధమైపోయెను. కొండొకసేపు మౌనమూని, యంచలిచే నశ్రుతోయముఁ దుడిచికొని, "నాయనా! విధిలిపి! నొసలునఁ గల నలువలేఖనముఁ దప్పింపనేరి శక్యము? మన మేమనుకొనిన నేమి ప్రయోజనము? పోనిమ్ము, ఆదైనను మంచిసంబంధము

కాని చెడ్డది కాదు గిరీశుఁడు బుద్ధిమంతుఁడు. చిన్నవాఁడు ఆస్తిగలవాఁడు. చిన్నారి సుఖపడునుకాని, కష్టపడదు" అని పల్కెను.

చంద్రశేఖరుఁ డేమియుఁ బలుకలేదు—నతముఖుఁడై యన్నము ముద్దలుగలిపి విడిచి వేయఁదొడఁగెను. ఏదియో పనిమీఁదఁ దల్లి వెలుపలి కరుగ నాతఁడు విస్తరికడనుండి లేచి, ముఖహస్త చరణప్రక్షాళన మాచరించుకొని నిజాగార మున కరిగి పాన్పునఁ బడియెను.

మఱునాఁటి సంధ్యాసమయమున నిలువీడి షికారునకై చంద్రశేఖరము వెలుపలి కరిగెను. దామోదరుని నిలయ బహిర్మందిరమున నప్పుడెప్పటియట్లు తేసిరు సభ సమావేశమాయెను. ఉత్సాహసమన్విత ప్రసంగము, నుచ్ఛ్వాసనమును లోపలినుండి వెల్వడి, పార్శ్వపథమున స్పష్టముగ వినవచ్చుచుండెను. ప్రమోద భూయిష్టమగునా కోలాహలము కర్ణగోచరము కాఁగనే, చంద్రశేఖరము పథమునఁ గొండొక తడవు నిలిచి, యేదియో యోజించి, పదం పడి మెల్లగ లోపలఁబ్రవేశించి, దామోదరుని విశ్రామమందిరములోని కరిగెను. వానకురిసి వెలిసినట్లు తోడనే యందలి కలరవముడిగెను. ఆతని వదన ముపలక్షింపఁగనే యచ్చటనున్న వారందఱు తెల్లఁబోయిరి—వారి ముఖశేఖరు లకస్మాత్తుగ మాసిపోయెను.

విశాఖపట్టణమునుండి చంద్రశేఖరము మరలివచ్చె నను

విషయము లలిత తక్క నికెవ్వరు నెఱుఁగరు. నేఁడు గిరీశుఁడును, నతనితో మఱియొక నూతన యువకుఁడు కూడ నందుఁ గూర్చుండి యుండిరి. ఆ క్రొత్త యాతఁడు చంద్రశేఖరము గదిలోఁ బ్రవేశింపఁగనే విస్మయపు చూడ్కుల నాతని ముఖముపైఁ బఱుపఁదొడఁగెను. ఆతనిఁ జూడఁగనే చంద్రశేఖర మొకించుక యబ్బురపడి యెవండో పిచ్చివాఁడై యుండునని తలంచెను! సభాధ్యక్షుండగు గిరీశుఁడు గభీరముఖముండలుండై యుత్తమాంగమును బైకెత్తక, దూరముననున్న భిత్తికపై దృష్టి నిబద్ధమొనరించి కదల మెదలకుండఁ గూర్చుండెను. అందఱికంటె నెక్కుడు బిగ్గఱగ దామోదరుఁడే యఱచుచుండెను. చంద్రశేఖరుఁ డాకస్మికముగ వచ్చి మోరిల నిలువఁగనే యతని ముఖము పాండురమై పోయెను. మాతుల పొంత నాసీనయై యున్న పొలంతుక తేనీరు చల్లారఁబోయుచుండెను. ఒకమాఱు శిరమెత్తి లలిత మరల నతముఖ యాయెను.

చంద్రశేఖరుఁడు ముందు కరుదెంచి దామోదరునికిఁ బ్రణమిల్లెను. అనంతర మతని ప్రక్కఁగూర్చుండి స్మితముఖుఁడై "ఇదేమి! ఇంతలోనే యంతయుఁ జల్లారిపోయెనేల?" యనెను.

మృదుస్వరమున దామోదరుఁ డేమియో యనెను—చంద్రశేఖరు నాశీర్వదించి యుండును. ఆతని నుడువులు స్పష్టముగ వినఁబడలేదు.

దామోదరుని మనసునఁగల భావమును జంద్రశేఖరము

గ్రహించెను. మనసు కుదుటపఱచు కొనుట కాతనికిఁ గొంం డొక సమయమొసఁగఁదలఁచి, చంద్రశేఖరము తానే ప్రసంగ సూత్రముఁబూని, ఆంధ్రమండలమునఁ దాఁగాంచిన వింత లను గుఱించియు, జనని రోగోపశమనము గుఱించియు, సాగర తీరమునఁ దాము పొందిన సౌఖ్యమును గుఱించియు నేమేమో చెప్పి, నూతనుని దెస జిజ్ఞాసతోఁ జూచెను.

ఇంతలో మనసును గొంతవఱకుఁ గుదుటఁ బఱచుకొని దామోదరుఁడిట్లనెను.

"ఈతఁడు మనగిరీశుని మిత్రుఁడు. ఇర్వురొకే గ్రామవా సులు. శైశవమునుండి రెూకేవిద్యాలయమునఁ జదువుకొనిరట. చిన్నవాఁడు కడుబుద్ధిమంతుఁడు. శ్యామబజారున నీతని నివాసము! అపుడపుడువచ్చిఁ యీతఁడు నన్ను దర్శించి పోవుచుండును. ఈ యువకునికి నేననఁ జాలయభిమానము."

చంద్రశేఖర ముత్తమాంగము పంకించి, తనలో ,,చిన్న వాఁడు కడుబుద్ధిమంతుఁడని, వాని వెఱ్ఱివాలకము చూడఁగనే తెలిసిన" దని యనుకొని, కొంతసే పూరకునియుండి, "చిన బాబయ్యా! వార్తలన్నియు శుభములే కదా?" యనెను.

దామోదరుఁ డుత్తరమొసఁగలేదు. శిరము వంచుకొనెను. గదినుండి నిష్క్రమింపఁ జంద్రశేఖరుఁడు లేవఁగనే గద్గద స్వరమున నావృద్ధుఁడు ,,నాయనా! అపుడపుడు వచ్చిపోవు చుండుము సుమీ! ఒక్కమాఱుఁగనే విడిచిపెట్టివేయకుము. జరిగిన దంతయు విని యే యున్నావుకదా?" యనెను.

"వింటిని" యని చంద్రశేఖరుఁడు గృహాభ్యంతరమున కరిగెను.

తోడనే లోపలినుండి గేహిని రోదన కలస్వనము విన నచ్చెను. పలుతెఱఁగుల రాగాలాపన మొనరించుచు, అపూర్వ సంగతులను తేటఁబఱచుచు, స్త్రీజన సులభమగు నాక్రందన కళలను వెలిబుచ్చుచు, వినువారికి వింతయు, వంతయు, ఆనందమును, ఆర్తియుఁగూడఁ గొలుపుచు దిక్తటములు బోరుకలుంగఁ బార్వతి పెద్దపెట్టున నేడ్వదొడంగెను.

చంద్రశేఖరుఁడు పార్వతినోదార్చి కొంతవడి కావు సెల వుదీసికొని వెడలిపోవ బయలుదేఱెను. అతఁడు వసారాదాటి వడివడిగ దొడ్డిలోని కరుగుచుఁ జీకఁటియందుఁ దలుపుమూల నిలచియున్న లలితను విలోకించెను. బావ సమీపింపగనే యామె ముందున కరుదెంచి, యతని పదముల మ్రోల సాగిలపడి భర్తృ చరణ రజమును నిజశీర్షమునఁ దాల్చి మందహాస మొనర్చుచు లేచి నిలువంబడెను. అనిమేష నేత్రయై వలపులొలుకు చూపుల హృదయేశునిపై నిగుడించుచు, నాఁటి నిశీఁదానాతనికడఁ బొందిన నవసమాగమా సౌఖ్యమును సూచించుచుగాఁబోలు ప్రేమాలింగన జిజ్ఞాసువలీల ముహూర్తమాత్ర మట్లే నీరవయై నిలచి యుండెను. కాని, తనకాంతుఁడీఱి పాపమా జవ్వని యప్రతిభయై వెన్కకుఁ దగ్గి "బావా! నేనేమి యపరాధ మాచరించితినని నాలేఖ కుత్తర మొసగితివికావు?" అని మృదుస్వరమున

నాతనిఁ బ్రశ్నించెను.

„లేఖయేమి?—నీకడనుండి నాకేయుత్తరమును రాలేదు. ఏమి వ్రాసితివి ?"

„ఏమి వ్రాసితినో, నీకది యందనపుడిఁక దానియుల్లేఖన మేల? చాల వ్రాసియుంటిని. బావా! ఇచటి యుదంత మంతయువింటివికదా! ఇపుడు నీయూన యేమో తెలుపుము".

చంద్రశే—(విస్మయస్వరమున) ఏమీ! నాయూనమా! నాయూనవలని ప్రయోజన మేమి?

లలిత యానుడువులవిని వెఱఁగొంది, బావముఖముపై స్థిర దృష్టిసారించి „ఏమట్లనుచుంటివి" అనెను.

„మఱెట్లందును? నే నాన యొసఁగు టెవరికి?"

„నాకే! మఱెవతె కొసఁగ సాహసింతువు ?"

„నీకుమాత్రము నాయాజ్ఞతోఁ బనియేమి ? నేనొకవేళ యాజ్ఞయొసఁగినను, నీవుదానినేల లక్ష్యపెట్టుదువు ?"

చంద్రశేఖరుని పల్కులు కడు గంభీరములై యుండెను. బావ నుడువులను వినఁగనే పాపము లలిత యెడద యంద డలు పుట్టెను. అపుడు లలిత యతని తనువుఁదాకునట్లునిలచి, డగ్గుత్తికతో „పోనిమ్మ! నీకిష్టమగు నెడల నన్నే ద్వేషింపుము. నీతమాషా నాకిపుడు రుచింపదు. నీపదములపైఁ బడెదను. ఇపుడు తెరువేమో తెలుపుము. భయముచే నాకు రేయి కన్ను మూతపడుటలేదు" అనెను.

„భయమెందులకు ?"

“ ఎందులకేమి ? భయముకాదా? నీవు నన్నువీడి దూర దేశమున కరిగితివి,—అత్తకూడ దగ్గరలేదు. ఈలోపుగ మామ అవకతవక పనిచేసి యూరకున్నాఁడు. అత్తయిపుడు కోడలిని తన గడప యంగడుగు వెట్ట నీయదేమోయని భయపడుచుంటిని ! ”

చంద్రశే—(క్షణకాల మూరకుని) — ఆమాటనిజమే ! అమ్మ నిన్ను గడపలో నడుగువెట్టనీయదు. నీమామ పరుని కడనుండి ప్రిభూతార్థమును గ్రహించినట్లాపెవినెను. ఆమాట యటుండ నీవిప్పుడు బ్రహ్మసమాజమువారి బాలికవు. నేను హిందూయువకుఁడను.

“వదినా ! అమ్మ పిలుచుచున్నది. ” అని యపు డన్న పూర్వవంటగదిలోనుండి యెలుగెత్తి పిలచెను.

“వచ్చుచుంటి”నని కేకవైచి, మరల మృదుస్వరమున బావ నుద్దేశించి లలిత యిట్లనెను. “నేను బ్రహ్మ సమాజము వారి బాలికనుకాను. నామేనమామ యేసమాజమునఁ జేరి నను నాకేమి? నీవే సమాజమువాఁడవో నేఁగూడ నాసమా జపుదాననే! అత్త నిన్ను వదలివేయఁజాలనిచో, నన్నుకూడ బరిత్యజింపనేరదు. నిన్నువీడిన, నన్నువీడును. గిరీశుని కడ నుండి సొమ్ముగైకొనిన విషయమందువా? — ఆసొమ్మును నేనుతిరిగి యిచ్చివేయుదును. ఇఁకఋణముమాట యందువా! రెండుదినములుముందునో, వెనకగనో దాని నిచ్చివేయవలెను కదా!

„అంత విత్తము నీకెందులభ్యమగును ?”

ఒకమాఱు కన్నెత్తి యాతని యాననమవలోకించి, ముహూర్తకాలము మౌనమూనియుండి లలిత యిట్లనెను: „ఆడుదానికి విత్తమెందు లభ్యమగునో యెఱుఁగవా? గేస్తురాండ్ర కరమెయ్యెడ దొరకునో, నాకుఁగూడ నయ్యెడనే దొరుకును.”

ఇంతదనుక నల్లనఁ బ్రసంగించుచున్నను, జంద్రశేఖరుని హృదయము పరిభవానలముచే జ్వలించి పోవుచుండెను. విద్రూపపూర్వకముగ నపుడాతఁడు „లలితాంబా! నిన్ను నీమామ యమ్మివైచెనుగదా!” యనెను.

అంధకారమున లలిత యాతని ముఖభావమును లక్ష్యింపఁజాలకపోయెను. కాని భావకంఠస్వరపరివర్తన మామెకుఁదెల్లమాయెను. దృఢస్వరమున లలిత, “అది యంతయు వట్టిమిథ్య. నా మామవంటి మానవుఁడు మఱియొకఁడు భూమిమీఁద లేదు—ఆతని నీవు పరిహాసింపకుము. ఆతఁడు పదుపాట్లను నీ వెఱుఁగకపోవచ్చును—లోకములోనివారెల్ల తెలియుంగుదురు. (ఒకించుక గొంతు సవరించుకొని, కొంచెము సేపు తాళి)—ఆతఁడు సొమ్ముఁ గైకొనినమాట నిజమే ; కాని నన్ను విక్రయ మొనరించుటకు నా మామ కెట్టి యధికారము లేదు. సొమ్ముఁ గొనినచో నన్నమ్మినట్లాయెనా!—నన్నాతఁడు విక్రయించుటకు సాహసింపలేదు. ఆయధికారము నీయొక్కనిదే ! నివిచ్చగించుచో,—ధన మీయఁవలయు నను

భయము నీకుండుచో నర్ధాంగిని విక్రయించుటకు సమర్థుఁడవే యగుదువు!" అని ప్రత్యుత్తరమునకొఱకై వేచియుండక, ద్రుతపదయై వెడలిపోయెను.

## ౬

ఆ నిశీధిని చాలసేపటివఱకు విహ్వలుని వడువునఁ జంద్రశేఖరుఁడు పథములందుఁ గ్రుమ్మరి పడంపడి నిజాలయముఁ జొచ్చి, ముక్కుపచ్చలారని పసినిసువగు లలిత యింతలోనే యెట్లా రింక యాయెననియు, నన్నిమాటల నెట్లు నేర్చెననియు, బిడియమంతయు వీడి జాణవీలమోల నిలచి తనతోఁ బ్రణయోక్తుల నెట్లు పలుకఁ జాలెననియు యోజింప దొడంగెను.

విస్మయమునకుఁ దోడాతని యెడఁ క్రోధపూరిత మాయెను—కాని, శాంతస్వాంతుఁడై యొకింత దూరమాలోచించు నెడల, నాకోపము లలితపైఁ గాక దనపైననే యని యాతనికి బోధపడి యుండును. చంద్రశేఖరుఁడు భగ్నమనోరథుఁడ నైతినని చింతించుచు, నిజకల్పనాజనితమగు క్రోధమునఁ బడి మ్రగ్గిపోవుచుండెను.

చిరుతప్రాయమునుండియు లలిత తలలో నాల్కవలెఁ జంద్రశేఖరు నింట నున్నను నామె యా యింటి నూతన గృహిణి కావలెనను తలంపేరికిఁ గలుఁగలేదు. శేఖరున కట్టి

తలం పున్నను, నతఁ డా విషయమును దనవారికిఁ దెలుపుటకు సాహసింపలేదు. పేదయింటి బిడ్డయగు లలితను దమ కోడ లినిగఁ బరిగ్రహించుటకుఁ దన మాతాపిత లియ్యకొనరని యతఁ డెఱుఁగును. అయినను నా లావణ్యలతిక తనకు లభిం పక యన్యుని సొమ్మైపోవునేమో యని ప్రథమమునుండి యతఁడు చింతిలుచుండువాఁడు. ఆ చింత వాపికొనఁ దుదకుఁ గృతనిశ్చయుఁడై, విశాఖపట్టణమున కేగుటకు మున్ను నాఁటి ప్రశాంతనిశీథిని గగనతలమున శిశిరకరుఁడు సాక్షియై చూచు చుండ నామె గళమునఁ బ్రసవమాల్యము వైచి, యదియే యుద్వాహదామమని వాక్రుచ్చెను. ఆనాఁడు మొదలు చంద్ర శేఖరుని పూర్వ చింతాస్రోత మరికట్టఁబడియెను.

కాని తదనంతరము దామోదరుఁ డొనరించిన కార్య మా చింతానిర్ఝరిణిని మరల నుప్పొంగఁజేసెను. ఆతఁడు మత భ్రష్టుఁ డయ్యెనను వార్తను విశాఖపట్టణమున విని, చంద్ర శేఖరము కడుంగడు వ్యాకులత చెందెను. తన చిరసంగిని నిందుమూలమునఁ గోల్పోవలసి వచ్చునేమో యను నాకుల పాటుతో నతఁ డట నిలువలేకపోయెను. కాని నిజాలయముఁ జేరిన యనంతర మశనిపాతమువలె లలితా విక్రయోదంత మాతని చెవులఁ బడియెను! ప్రణయ ప్రతిద్వంద్వియై గిరీశుఁడు దామోదరునకుఁ బెన్నిధి చాడ్పున లభించెను—లలిత యాతని సొమ్మైపోయెను! ఇఁక నతని విత్త మాతని కొసఁగి మర లించు టెందులకు? విక్రయమునకుఁ బ్రతివిక్రయమా?—

చంద్రశేఖరుని చింతాఝరి యిపుడు వ్యతిరేక దిశగఁ బర్విడ దొడఁగెను! ఈవఱలో నామె లభింపకపోవునేమో యని యాతఁడు చింతిలుచుండువాఁడు—యిపు డామె లభించిపోవు నేమో యని చింతింపవలసి వచ్చెను! పరహస్తగతమైన రత్నము తనకేల?—కాని భగ్నమనోరథానలమును తా నెంత యత్నించినను, జంద్రశేఖర మార్పఁజాలునా? ఆర్పఁ జాల కేమి చేయును? చంద్రశేఖరుఁడు స్థిరమతి కాఁజాల కుండెను. చింతాలహరీ వీచికాహతిచే వాని చిత్తము క్షుభితమై పోయెను!—కొండొకవడి లలిత తనదియే యనుకొనును! మఱుక్షణమందే తన దెట్లని భావించును! అనుకూల ప్రతికూలయోచనలచేఁ గళవళపా టొందుచుండెను కాని యిపుడు తన కర్తవ్య మేమో చంద్రశేఖర మెఱుంగఁజాలకుండెను. కాని లలిత యానాఁడు పలికిన నుడువులు వాని కొకింత యాశఁ గొల్పెను—ఆతని భావనాస్రోత మెప్పటియట్ల స్థాపితము కా దొడఁగెను. మేనకోడలి నమ్ముటకు దామోదరున కెట్టి హక్కు గలదు? గిరీశునికడనుండి సొమ్ముఁ గైకొని నంతన లలిత యాతని యర్ధాంగి యెట్లగును? పరిణయ మన వాణిజ్యమా?—పవిత్రయుద్వాహబంధమునకును నర్థలాభమునకును సంబంధ మేమి? లలిత గిరీశుని సొత్తెట్లగును? ఇంతదనుక కాదు—కాని, విధ్యుక్తముగ పరిణయ మాచరించుకొనిన మొదల గిరీశున కామె యర్ధాంగి కాక తప్పునా? ఇంతదూర మగ్రగమంబైన ప్రణయకాంతి యాకించిత్కా

ర్యము ని కెంతలో నిర్వర్తించును? సామ్మొసంగినవాం డూర
కుండునా? కాని లలిత నిన్నకుండునా?

దైవానుగ్రహామున శ్యామబజారుసంబంధము స్థిరము
కాలేదు! శ్యామసుందరుండు కోరిన పెద్ద మొత్తము మొసంగు
టకుం గడవటకు వారు వెనుకంజయే వేయందొడంగిరి. శ్యామ
సుందరుం డెంతయో చెప్పింపంగా ముప్పదివేల రూకలను
మాత్ర మీయజాలుదునని కన్యాప్రదాత వాక్రుచ్చెను. అంత
టితోం దృప్తి పొంది తిథినిర్ణయముం గావింప శ్యామసుంద
రుండు నిశ్చయించెను. కాని పెండ్లికుమార్తె భువనేశ్వరికి
నచ్చలేదు. ఆ సంబంధము వలదని యామె భర్త కెఱిం
గించెను. జ్యేష్ఠపుత్రుండుగూడ శ్యామసుందరుని కట్లే చెప్పెను.
దానంజేసి యా సంకెలనుండి చంద్రశేఖరుండు విడివడియెను.
కాని యంతటితో శ్యామసుందరుండు నిశ్చేష్టుండు కాలేదు.
నలువదివేలన్న 'తందానపాట' మరల మొదలిడిమఱొక సంబం
ధమునకై యాతం డన్వేషింపగడంగెను. తన కధికధనప్రాప్తి
యలవడనున్నపు డాసంబంధ మేల తిరిగిపోదని యోజించి,
ద్విగుణీకృతోత్సాహుండై యతండు ప్రయత్నములు చేయ
గడంగెను. కొడలికంటె ముందు నంచు లెపుడు తన గడపం
జొచ్చునాయనియే శ్యామసుందరుం డాతురపడుచుండెను!

లలిత తన్ను వీడి చనకమున్నె దానే యామెను వీడి చన
వలసివచ్చునేమో యను సంకోచమునుండి చంద్రశేఖరుండు
విముక్తుం డాయెను. కాని జనకుని యడియాసాకుధర మాత్రని

ప్రోల నిలచెను! లలిత తన యర్థాంగి యైనట్లునే యోజించు చుండెనని యామె ప్రసంగమువలనఁ జంద్రశేఖరుఁడు కని పెట్టెను! ఆనాఁటిరాత్రి తా నొనరించిన కార్య మింత గురుతరమైపోవుననియుఁ, దనకు నిక్కముగఁ బరిణయ మాయె నని శంకారహితస్వాంతయై లలిత తలంచుననియు, నందుల కన్యథా వర్తించునెడల ధర్మవిరుద్ధమగుట నిక్కమనియు జంద్రశేఖర మానాఁడు తలంచియుండలేదు. "జరుగవలసినది జరగిపోయినది. ఇఁక నీయనుబంధమునుండి నీవు మరలఁజాలవు. నేనును మరలజాలను" అని యానాఁ డాతఁ డనినను నేఁడు లలిత యోజించు తెఱంగున నపుడు చంద్రశేఖరము తలంప లేదు. ప్రాయశః అట్లు తలంచుట కాతనికి వ్యవధి లేకపోయి యుండవచ్చును.

అ సమయమున శశాంకుఁ డభ్రతలమున షోడశకళా సమన్వితుఁడై వెలుగొందుచుండెను. వసుమతీసీమంతిని జ్యోత్స్నా తాంబరధారిణి యాయెను!

లలిత కంఠసీమ గుసుమదామము విలసిల్లుచుండెను. ప్రేయసీవక్షఃస్పందన ప్రథమసుఖము నాతని యెడఁద యపుడే యందఁగల్గెను. ప్రణయాభిలాషు లధరసుధయను వచించు మధురపానీయముకూడ నతని కపుడు లభించెను. స్వార్థము గాని, సాంసారికములగు లగ్గుయెగ్గులుగాని యతని కపుడు చిత్తగోచరములు కాలేదు—అర్థలోలుపుఁడగు జనకుని రుద్రమూర్తి, చిత్రచక్షుసమక్షమునఁ గన్పట్టలేదు! జనయిత్రికి

లలితపై నవ్యాజానురాగ ముండుటంజేసి, యామెను దమ
పరిణయమున కంగీకరింపఁజేయుట కఠినము కాఁజాలదనియు,
నగ్రజుద్వారా జనకుని స్వాంత మెట్టులైనఁ గోమల మొన
రింపనోపుదుననియుఁ, దానంజేసి చరితార్థుఁడను కాఁజాలక
పోననియుఁ, జంద్రశేఖరుఁడు యోజించెను. కాని తండ్రియాస
యింత పెచ్చు పెఱుగునని యాతఁడు తలంపలేదు. ముఖ్య
ముగ దామోదరుఁ డిత్తెఱంగునఁ దన సంఘసంపర్కలతికను
దుస్సహదుఃఖలవిత్రిముచేఁ ద్రెంపివైచి, గిరీశుని యధీనుఁడై
తన యాశాపథమున కడ్డుగ నొక యున్నతప్రస్తరఖండ మిడు
నని పాప మాతఁడు యోజించియుండలేదు. ఇపుడు పెక్కు
తలఁపులచే నతని చిత్తము క్షుబ్ధ మగుచుండెను! విధాతయే
యతనియెడఁ బెడమొగము వెట్టుకొని కూర్చుండియుండెను.

“అర్థపిపాసువగు జనకుఁ డర్థకాంక్ష వీడి, లలిత మాతుల
కడనుండి ధన మపేక్షింపక, యెదురుగఁ దానే యాతనికిఁ
బెద్దమొత్త మొసఁగి గిరీశుని మరల్పఁజాలుట కియ్యకొనునని
యోజించుట గగనప్రసూనము నపేక్షించుటకాని వేఱు
కాదు! కులభ్రష్టులింట నన్నపానీయములఁ గొను నెలంతను
గోడలిగఁ బరిగ్రహింపుమని జనయిత్రి నడుగుట నిష్ఫలము!
ఇఁక నే నీసంబంధమువిషయమై వారి కెఱింగించుట నిరర్థ
కము—నిరర్థకమనుమాట యటుండ నది నగుబాటునకుఁగూడ
గారణము.” అని చంద్రశేఖరము యోజింపదొడఁగెను.

కాని, లలిత నాతఁడు బాగుగ నెఱుఁగును. శైశవమాదిగ

నామె యాతని కరములందేఁ బ్రవర్ధమాన యాయెను. తన ధర్మమని దేని నామె యొకమాఱు నమ్మెనో, కొండ విఱిగి తలపైఁ బడనున్నను, నామె దానిని త్యజింపదు. తా నాతని ధర్మపత్నినని యెఱుంగుటంజేసియే నాఁడు సంధ్యానంతరమున నిస్సంకోచయై ప్రేమసుధాస్వాదనాభిలాషియై లలిత యాతని ముందు నిలచెను—కాని, చంద్రశేఖర నిప్పు డేమి చేయవలెనో యెఱుంగఁజాలక, తన మనసు పరిపరిగతులఁ బర్వెత్తుచుండ, నుస్సురనుకొని యొక దీర్ఘనిశ్వాసము వీడి మరల నిట్లు తలపోయదొడఁగెను.

“లలితను గిరీశుని కిచ్చి పెండ్లి చేయుటకు మాటలు జరగుచున్నవి. కాని యతనిని జేపట్టుటకు లలిత నెవరు సమ్మతింపఁజేయఁజాలుదురు?—కాని తన పట్టు వీడఁజాలని లలిత తన గుట్టును బయల్వెట్టుకొనకుండ నుండ నేరదు! ఆనాఁటి ప్రణయోదంతము నామె చెప్పివేసితీరును.”

చంద్రశేఖరుని ముఖమంతయు నెఱ్ఱనై పోయెను. నేత్రములుత్తప్తములై పోయెను! ఆహా! అనురాగము మానవుల నున్మాదులఁ గావించివైచును కదా!—పుష్పమాలను లలిత కంఠమున వైచి, బుద్ధిమంతునివలె జంద్రశేఖరము మిన్నకుండెనా!—ఆసౌందర్యవల్లి నిజవక్షమునఁ జేర్చి, ప్రేముడి నాలింగనమొనర్చుకొని ముఖచుంబన మొనరించెను. అక్కార్యము దోసమని తలఁచి లలిత యందుల కంకలివెట్టెనా? తన తనూకుజమున వెలువడిన యౌవనఫలములనందుటకాతఁడే

యధికారి యని యాలతాంగి గ్రహించెను! తన సౌందర్య సంపదను భోగించుట కాతనికే సంపూర్ణస్వత్వము కలదని యారాజానన గ్రహించెను! తన చిత్తమును హరింపఁగల హర్త యాతఁడేయని యాపయోజాస్య గ్రహించెను! తన యధరమధురసుధ నాప్యాయనంబుగఁ గ్రోలుట కాతనికే హక్కు కలఁదని యావల్లవోష్ఠి నమ్మెను! అట్లు నమ్మిన నెలంత ప్రేమకౌఁగిలి జొచ్చుట కేల త్వరపడదు? తన చిర చెలిమికానిఁ దన యధరామృతముచేఁ దననెచ్చెలి ముద్దులఁ గైకొనఁ దన చెక్కిళ్లు నేల ప్రేరేపింపదు? లలితా చంద్ర శేఖరులకు నిజముగఁ బరిణయము కాలేదు—కాని లలితా చంద్రశేఖరుల యాత్మలకుఁ బరిణయమై పోయెను! కాని, యాత్మపరిణయమును పరిగణించు పుణ్యాత్ములేరి? కీరముల లీల మంత్రము లుచ్చరించువారే కాని పరిణయము యొక్క మూలమంత్రమును, పరస్పరప్రణయ మహాత్మ్యమును బరిగ ణించు పవిత్రాత్ములేరి? తనయు నభిలాషఁ దీర్చు నర్థకాంక్షా రహితుఁడగు జనకుఁడేడి? ఒకముద్దియ ముద్దుఁ జెల్లించుట కర్జమని తలంచు గృహస్థుఁడేడి?—దారిద్ర్య పీడితుఁడైన దామోదరున కట్టితలంపు శశవిషాణంబు కాదా? బాఁ బడిన కడగండ్లనుండి దరిఁ జేర్పఁగల తెప్పయై గిరీశుఁ డాతని ప్రోలఁ దోఁచెను! శ్యామసుందరుఁడో—అర్థపిపాసవ్యథి తుఁడై నూతనసంబంధము నన్వేషించుచుండెను. ఇఁక లలిత ముద్దులుగాని, చంద్రశేఖరుని యాటలుగాని చెల్లు టెట్లు?

కాని మఱొకని సొత్తైన తనకాయమును లలిత గిరీశున కర్పిం
చుట కేల యియ్యకొనును? అట్లియ్యకొనకుండుటకు హేతువుఁ
జూపవలెను కదా! తన రహస్యోద్వాహ యుదంతము నంతయు
లలిత ప్రకాశ మొనరింపక తప్పదు. జనకునియెడఁ గడు భయ
స్తుఁడై మెలంగు చంద్రశేఖరుఁ డాయాచరణమునకుఁ దండ్రి
కడ నేమియుత్తర మొసఁగును?—ఒరులయొద్ద మాత్ర మాతఁ
డేమి సమాధాన మొసఁగును? జననీ జనకులు సమ్మతింపని దే
యాతఁడు లలిత నెట్లు పరిణయమాడఁ గలఁడు?—శ్యామ
సుందరుఁడా వివాహమునకు సమ్మతించునా? ఇసుమునఁ
దైలముఁ దీయవచ్చును గాని, యతని నందుల కంగీకరింపఁ
జేయుట సాధ్యముగాదు! ఇఁక లలిత పని యేమి?—ఆమె
గిరీశునిఁ బరిణయమాడునా? చంద్రశేఖరుఁడు కాక యన్యుని
కర్ధాంగి యగునా? అట్లని స్వప్నమందైన యోజింపరాదు!
అట్లగుచో నామె యవివాహితయై యుండునా? పాపము చం
ద్రశేఖరున కేమియుఁ దోఁచుటలేదు. యోజించిన కొలఁది
యతనికి హృదయవేదన యధికము కాఁ జొచ్చెను. నిరాశయే
గాక పరిభవలజ్జాదు లాతని మనమును గలచివైచెను. ఇఁక
నచిరకాలములోఁ దనరహస్యకాహిని ప్రకాశమై పోవునని
యాతఁ డడరదొడఁగెను. చంద్రశేఖర మిఁక నింటఁ దలిదం
డ్రులకుఁ గాని, బాహిరమున లోకులకుఁ గాని తనముఖ
మెట్లు చూప సాహసించును?

లలిత తనయర్ధాంగి కాఁ గలదని యాసించుట యడియాసయే
యని చంద్రశేఖరము నిశ్చయించు కొనియెను. విఫలమనో
రథుఁ డాయెనను చింతకుఁ దోడుఁ దన రహస్యకాహిని
ప్రకాశమగునేమో యనియుఁ బలువుర మ్రోలఁ దాను నింద
పాలు కావలసి వచ్చునేమో యనియు భయమందుచుఁ
జంద్రశేఖరము మఱికొంత చింతఁ గల్పించుకొను చుండెను!
కాని, యతని సాహసకృత్యమును గుఱించి యెవ్వరు నతని
బ్రశ్నింపలేదు. తమ రహస్యచెలిమి యుదంత మొరులకుఁ
దెలిసియుండెనో లేదో కూడ నాతఁ డెఱుఁగడు.

దామోదరుని గృహమునుండి శ్యామసుందరుని గేహము
నకు రాకపోకలు పూర్తిగ నుడిగెను. చంద్రశేఖరుని యాగార
సమ్ముఖమునకు దామోదరుని డాబా కన్పట్టుచునే యుం
డును. ఈవలి కరుదెంచి నిలచి చూచినచో నాడాబాపై
నుండువారు చూపట్టక మానరు. శేఖరుఁడు తానొరుల దృక్ప
థమునఁ బడుదు ననుకొని కాఁబోలు డాబాకెదుటఁ గల తన
గవాక్షమును మూసివైచెను. ఇట్లొక మాసము గడచిపో
యెను. లోకులవలనఁ దనకు నింద ప్రాపించునను జింత సన్న
గిల్లెను. తనకెట్టి చెట్ట వాటిల్లనున్నను, స్త్రీ బిడియము విడిచి
తనగూఢ చర్యను వెలిఁబుచ్చుకొన లేదనియుఁ, దనగుండె

లవియనున్నను నామె నోరువిప్పి మఱుఁగుమాటఁ జెప్పుట కియ్యకొన దనియు గ్రహించి, యబల నట్లు సాహసోపేతలఁ గావించిన సృష్టికర్త బుద్ధి నాతఁడు మిగులఁ బ్రశంసించెను. కాని నిందపడుదునను చింత చిత్తమునుండి బాసిపోయినను, చంద్రశేఖరుని హృదయమున శాంతి విరాజిల్లుట లేదేల? మఱుఁగున జరగిన చెయిదము మఱుఁగుననే యుండెనని యెఱింగిన యనంతరము కూడ నొక యభూతవ్యథానలముచే నాతని యెడద యంతయు జ్వలించి పోవుచుండె నేల?—

లలితగుట్టుఁ బాయునను చింత యిపు డాతనిని వీడి చనినను, దానికిఁ బ్రతిగా నామె తనపట్టు వీడకపోవను వంత యాతని చిత్తము నాక్రమించెను. ఆమె తనపట్టు వీడునన, గిరీశుని జేఁబట్టుటయే కాదా? ఆతలంపు తోఁచినపుడు బాహ్యాంతరములం దాతని యెడలు దుస్సహవేదన హుతాశనకీలలచే నెట్లు దగ్ధంబు కాకుండును?

చంద్రశేఖరుఁడు సంధ్యాసమయములందు సయితము షికారునకై యిలువెడలక దీర్ఘచింతానిమగ్నుఁడై నిజసౌధోపరితలమునఁ బచారిఁ జేయుచు, నపుడపుడు లలిత యాలయముపైఁ జూడ్కులు నిగుడించుచు, నంతరంగమందలి వేదన నందే యడంప యత్నించుచు దినములను గడప దొడఁగెను. లలిత నుద్దేశించి యెన్నిమాఱు లాతఁడు తన యాతురంపు దృక్కుల నాగేహముపైఁ బఱపినను, నామె యెన్నఁడు నాతని దృక్పథమునఁ బడలేదు. లలితమాట యటుండ

దామోదరుని కుటుంబమువారిలో నెవ్వరును గూడ వానికి గోచరింపలేదు. కాని, నేఁడేలకో యన్నపూర్ణ డాబాపై కరుదెంచెను. కాని, అన్న దృక్కులు తనపైఁ బడఁగనే నత ముఖయై, 'ఆమెను బిల్తునా, పిలువకుందునా' యని జంద్ర శేఖరము యోజించుచుండ నంతలో దృతపదయై నిష్క్రమిం చెను.

మఱొకమాసము గడచి పోయెను.

ఒకనాఁడు మాటలసందర్భమున భువనేశ్వరి నందను నుద్దే శించి "నాయనా! ఈమధ్య నీవు లలితను చూచితివా?" యని ప్రశ్నించెను.

"లేదు—అట్లడుగుచుంటివేల?"

"రమారమి రెండునెల లైన పిదప నిన్న యపరాహ్ణ మాబిడ్డను డాబాపైఁ జూచితిని—బిడ్డవాలకమే మాఱిపో యినది! చిక్కి, శల్యమై యున్నది. ముఖ మంతయు వాడి పోయినది. వయసుమీఱినదానివలె గన్పట్టినది—ఆ రూపు గాంచి, యది పదునాలుగేండ్లు బిడ్డయని యెవరును ననుకొనఁ జాలరు."

భువనేశ్వరి నయనము లశ్రుపూరితములై పోయెను. అం చలిచేఁ గనుగవఁ దుడుచుకొనుచు గద్గదస్వరముతో నామె యిట్లు వచించెను. "బిడ్డ వస్త్రములు మాసి జీర్ణములై యున్నవి. నాకుఁ గనిపింపఁకుండునట్లు చినుఁగులను మూసి కొని కడు లజ్జితయై నిలువంబడెను. 'అమ్మా! నీకు గుడ్డలు

లేవా?' యని యడిగితిని. 'లేకేమి? ఉన్న' వని చెప్పినది. కాని నేను నమ్మలేదు. లలిత యెన్నఁడు మేనమామ యిచ్చిన వస్త్రముఁ గట్టుకొనలేదు. ప్రథమమునుండి దానికి వలయు పుట్టములను నేనే యొసఁగుచు వచ్చుచుంటిని. కాని యీ యేడు నెలలనుండి బిడ్డకొక గుడ్డనైన నీయలేకపోతిని. చిన్నప్పటి నుండి—"

ఆమె కిఁక నోటమాట రాలేదు. అశ్రువులఁ దుడుచు కొనుచుఁ బాప మామె వెక్కి వెక్కి యేడ్వ దొడఁగెను. కడుపునఁ గన్న బిడ్డకన్న మిన్నగ లలిత నామె ప్రేమించుచుండెను.

చంద్రశేఖర మేమియుఁ బలుకక బెడమొగము పెట్టుకొని కూర్చుండెను.

చాలసేపైన పిదప భువనేశ్వరి మరల నిట్లు పల్కెను. "లలిత నన్నుఁ దక్క యొరుల నెన్నఁడును దేనిని గాని యడిగి పుచ్చుకొనెడిది కాదు. ఆఁకలి గొనినపుడైన, నోరు తెఱచి మేనత్త నన్నముఁ బెట్టుమని యడుగునది కాదు. మెల్లగ నా యొద్దకు వచ్చి, నాచుట్టుఁ దిరిగెడిది. ముఖముఁ జూచినంతనే దాని యవస్థ నాకు బోధపడియెడిది. ఇపుడు దాని నెవరుఁ గన్నెత్తి చూడకపోవుటచే బిడ్డ దిక్కుమాలినదై క్రమక్రమముగ నెండిపోవుచున్నది! అది నన్నుఁ జనువుగఁ బిల్చుటయే కాదు—కన్నతల్లిని ప్రేమించునట్లు ప్రేమించుచుండును."

చంద్రశేఖరము తన ముఖమ్మును మాఱువైపుగఁ ద్రిప్ప

సాహసింపఁ జాలకపోయెను. తాఁ జూచు దెసకే చూడ్కుల నిగుడించుచు "అట్లైన, అమ్మా! దాని కేమి కావలెనో యేల అడుగఁగూడదు?" అని యాతఁడు ప్రశ్నించెను.

"ఎట్లడుగనురా తండ్రీ! నీ తండ్రి వచ్చుపోవు త్రోవను కూడ మూసివైచెను. జాతిభ్రష్టుల ముఖముఁ జూడవలదని కఠినశాసనము విధించెను. ఏ మొగము వెట్టుకొని, బిడ్డను చెంతకుఁ బిలిచి పట్టెడన్నముఁ బెట్టఁగల్గుదును? దుఃఖకుండమునఁ బడి క్రుగ్గి క్రుగ్గి, తాఁ జేయు చెట్ట యెట్టిదియో యోజింపక మఱఁది యొక తెలివిమాలిన పనిఁ జేసినది నిజమే—కావలసినవారమని మన మేదో యొకవిధముగఁ బ్రాయశ్చిత్తముఁ జేయించి, మనవానిని మనము మరల జాతిలోఁ గలుపుకొంటిమా? 'దూరముగఁ దొలఁగిపొమ్ము పలుగా!' యని యొక్కమాటుగ వెలివేసితిమి. మనబోటివారి బాధపడలేకనే యతఁడు మన సంఘమునుండి పాఱి 'బ్రదుకు జీవుడా' యనుకొనినాడు. ముఖ్యముగ మీ నాయన పోరుపడలేక, తన గోడు సహింపలేక యా దౌర్భాగ్యుఁ డట్లు వెలియాయెనని కూడ నేనే చెప్పుచుంటిని. రేఁ బవలు లొక్కపాటయేకదా నీతండ్రిది—'బాకీ! బాకీ! బాకీ!' మనసు వేగినపుడు మనుజుఁ డెట్టి తెగువకైన వెనుదీయఁడు. కాని, యొకించుక దూరము యోజించి చూడ మఱఁది మంచిపనియే చేసినట్లు నాకుఁ దోఁచుచున్నది. గిరీశుఁడు మనకంటె వారికిఁ జాల దగ్గఱివాఁడైనాఁ డిపుడు—అతఁడు చిన్నవాఁడు, బుద్ధిమంతుఁడు లలిత

కాతఁడే భర్తయైనయెడల, బిడ్డ సుఖమననేమో యెఱుఁగును. రాఁబోవు మాసములోనే శుభకార్యముఁ జేయఁ గలపెట్టు కొనిరఁట."

చంద్రశేఖర మాకస్మికముగ ముఖముఁ దల్లిదిక్కుగఁ ద్రిప్పి, "ఏమి, వచ్చే నెలలోనే శుభకార్యము జరగిపోవునా!" యని ప్రశ్నించెను.

"అవును—అట్లనియే వింటిని."

చంద్రశేఖర మిఁకేమియుఁ బ్రశ్నింపలేదు.

భువనేశ్వరి కొంత తడవు మిన్నకొని పికప నిట్లనెను.

"తన మామకు సుస్తీగా నున్నదని లలిత నిన్న చెప్పినది. పాప మాతనికి సుస్తీకాక స్వాస్థ్య మెట్లుండును? ఏదియో యొక చింతచే వాని మన సెప్పుడు చింతనిప్పువలె రవులు చునేయుండును. దానికిఁదోడు డీమధ్య కొంపలో గోల యెక్కు వైనది. రేయింబవళ్లు పార్వతి తన పెడబొబ్బలతో కొంప మీఁది పెంకుల నెగురఁగొట్టివేయుచున్నది. ఎప్పుడు చూచి నను, ఒకేతీఱుగ నుండును—ఒక్కనిముసమైన గోల శాంతిం పదు. ఇఁక నా ముసలివానికి సుఖ మెచటనుండి వచ్చును!"

తల్లిమాటలను వినుచుఁ జంద్రశేఖర మట్లే స్తబ్ధుడై యుండెను—ఏ మనుటకును వానికి నోరాడుటలేదు.

కొంతసేపైనపిదపఁ దల్లి నిష్క్రమింపఁగనే, యాతఁడు నిజశయ్యపై మేనుఁ జేర్చి లలితవిషయమును యోజింప దొడఁగెను.

వీరి వీధి మిగుల యిరుకైన దగుటచే రెండు బండ్లు తప్పు కొని నడచుటకుఁ దగు తావులేదు. ఒక శకట మొకప్రక్కకు బాగుగఁ జేరి నిలచినగాని, రెండవది పోఁజాలదు. రమా రమి పది దినములు గడచిన యనంతర మొకనాఁటి సంధ్యా సమయమునఁ జంద్రశేఖరుఁడు కచేరినుండి మరలి యరుదెంచు చుండ నాతని శకటము దామోదరుని నిలయసమ్ముఖమున మఱొక బండి నిలచియుండుటచే, నిలచిపోవలసివచ్చెను. బండినుండి దిగి చంద్రశేఖరుఁడు బండి వచ్చిన కారణము విచా రించగా వైద్యుఁ డరుదెంచినట్లు తెలియవచ్చెను.

కతిపయదినములకుఁ బూర్వము దామోదరుఁ డస్వస్థుఁడై యుండెనని యాతఁడు తల్లి కడ వినియుండుటచే, నొకవేళ యిప్పు డాతనివ్యాధి ప్రబలమై యుండునని యోజించి, చంద్ర శేఖరము తిన్నగ దామోదరుని శయనాగారముఁ జొచ్చెను. ఆతఁ డనుకొనినట్లే యయినది. నిర్జీవునిమాడ్కి దామో దరుఁడు పాన్పుపైఁ బడియుండెను. శయ్యకొక పార్శ్వమున లలితాగిరీశులు శుష్కముఖులై కూర్చుండియుండిరి. సమ్ముఖ మునను్న చౌకిపై వైద్యుఁ డాసీనుఁడై నాడిఁ బరీక్షించు చుండెను.

చంద్రశేఖరుఁడు ప్రవేశించుటఁ గాంచి దామోదరుఁ డస్ఫుటస్వరమున "నాయనా! కూర్చుండు" మనియెను. లలిత తన మేలిముసుంగును మఱింత ముందునకు లాగుకొని ముఖ మోరఁజేసికొని కూర్చుండెను.

వైద్యుఁడుకూడ బౌబజారువాస్తవ్యుఁడు. చంద్రశేఖరు నాతఁడు బాగుగ నెఱుంగును. అతఁడు వ్యాధిపరీక్షఁ గావించి యౌషధ మొసఁగి చంద్రశేఖరుని వెంటఁ గొని వెలుపలి కరుదెంచి కూర్చుండెను. గిరీశుఁడు వారి వెంట వెళ్ళి వైద్యు నకు సొమ్మొసఁగి, సెలవు గొనునప్పుడు వైద్యుఁడు "వ్యాధి యింకను ప్రబలము కాలేదు. ఇపుడు గాలి మార్పుట ముఖ్యా వశ్యకము. అందుచే వెంటనే రోగి నిచ్చటనుండి మఱొకచోటు నకుఁ గొనిపోవుట మంచిది" అని యతనితోఁ బల్కెను.

వైద్యుఁడు వెడలిపోవఁగనే గిరీశచంద్రశేఖరులు మరల దామోదరుని గది కరిగిరి.

లలిత, కనుసన్నతో గిరీశు నొక వలనుకుఁ బిలిచి, యత నితో మెల్లనిస్వరమునఁ బ్రసంగింపఁదొడఁగెను. వారలఁ గాంచి చంద్రశేఖరుఁడు నిర్విణ్ణుఁడై పోయెను. ఏమియుఁ బల్కఁజాలక యతఁడు రోగిదెసఁ జూపుల నిగుడించుచు నలనున్న చౌకీపైఁ గూర్చుండెను. దామోదరుఁ డింతకుమున్నె రెండవ ప్రక్కకు త్రిగిలి పరుండుటచే చంద్రశేఖరుఁడు మరల గదిలోఁ బ్రవేశించు టాతఁడు చూచియుండలేదు.

చంద్రశేఖరుఁ డప్రతిభుఁడై కొంతసే పట్లే యుపవిష్టుఁడై యుండి, అందుండి నిష్క్రమింప లేచి నిలువంబడెను. అపుడుకూడ లలితాగిరీశులు రహస్యప్రసంగము సలుపుచునే యుండిరి. ఇరువురిలో నెవ్వరునుగూడ నతనిని గూర్చుండుమని కోరలేదు; మరల రమ్మని నుడువలేదు—ఒక్కమాటయైన

నాడలేదు.

శేఖరుఁడు నిజాలయమున కరుదెంచి, కచేరీయుడుపులను విడుచుచుండఁ నతని చిత్తము పెక్కుచింతలచే సంక్షుభితము కాఁదొడంగెను. కన్నులార నేఁ డంతయుఁ గాంచి, గిరీశుఁడు దామోదరునకుఁ బరమాప్తుఁ డగుటయు, లలిత కాశ్రియ మొసఁగి యామె భవిష్యమును భరింపఁబోవు భవ్యచరితుఁ డగుటయు నాతఁడు గ్రహించెను! అట్టి విపత్సమయమం దైనఁ, దన యాశ్వాసవాక్యము నొందదైన నపేక్షింపకుండు టకుఁ దాను లలిత కేమియుఁ గాన ట్లానెలంత తలంచెనని యోజించుచుఁ జంద్రశేఖరుఁడు క్రోధాభిమానములచే దహిం పఁబడిపోయెను. ఒకమా ఱుస్సురనుకొని యతఁ డొక యా యలకుర్చీపై నూర్ధ్వముఖుఁడై పరుండెను.

"లలితా! ఇంతలోనే నీ వెంతదాన వైపోయితివి! నిజ ముగ నీవు నాయెడ బద్ధానురాగవై యుంటివని యోజించి తిని. చిన్ననాఁటినుండి నా సమ్ముఖమున మెలఁగిన నీ విప్పుడు నేఁ బరాయివాఁడననియు, నపరిచితుఁడననియుఁ దలంచితివా! ఎట్టి కృతఘ్నవైతివి! ఏకాంతమున నన్ను సత్యవివాహ మాడి 'నీ యర్ధాంగిని నే' నని మృషాప్రణయసల్లాప మొన రించి నేను జూచుచుండఁగనే సిగ్గు వీడి యొక పలుఁగాకిని మఱుగునకుఁ గొంపోయి వానితో గుసగుసలాడ గడంగిన నీ తెగువ నిజముగఁ గొనియాడఁదగినదే! ఒకప్పుడు నా యాజ్ఞ లేనిదే యెవ్వాని ననుగమించి నాటకమున కరుగ

సాహసింపకపోతివో నేఁడాతని కుఱఁగలిఁ జేరియే యెదుట నే నుంటినని సుంతైన సంశయింపడక సరససల్లాపములను సలుప సమకట్టితివిగా! ఆహా! ఎంత విపరీతము! ఎంత ఘోరము! ఎంత దుర్న్యాయము! నే నాగారమును బ్రవేశించి నంతనే నీ ముఖముఁ జూచుట కర్హుఁడఁ గానని యోజించి మేలిముసుంగును మఱింత బిగలాగుకొంటివిగా! మన రహస్య చర్యను జ్ఞప్తికిఁ దెచ్చుకొని లజ్జచే నీ యవగుంఠన మట్లు మొగములకుఁ దీసికొంటివని యెట్లు తలంతును? అట్టి లజ్జయున్న యాఁడుదానవే యైనచో, నొక వలపుకానిఁ గూడి గూఢ ప్రసంగము సలుప సాహసింతువా? లలితా! ధనాశ వీడఁ జాలక, గిరీశుఁడే నీ ముప్పుఁ దీర్చువాఁడని నమ్మి నాని దవ్వు లోకనిపోతివి! ఆ తులువయెడ మక్కువలేక, నిజముగ నా ధర్మపత్నివని నీవు తలంచియే యున్నయెడల మన రహస్య పరిణయవిషయమును నీవింతలోనే విస్మృతింపకుందువు. ఇఁకేమి వెరవని నన్ను వేఁడియుందువు! నన్నుఁ బాసి నీ శరీర మునన్యునకమ్మ కొనవని నేనింతదనుక బ్రత్యాశించితిని; కాని నీవిట్టి కులట వగుదువని యోజింపనైతిని. "ఇట్లుభావిం చుచుఁ జంద్రశేఖరము తన మనమున నొక భీకరనిరయముఁ గల్పించుకొనియెను. క్రోధపూర్వకముగ నైన నాయుదంత మును గుణించి యాతఁడు లలిత నడుగ గమకింపలేదు. తెగు వకుఁ బూనిన తెఱవ నేమి యైన నడుగనేల నని నత డను కొనెను.

"నాయనా! ఇంకను కాళ్లు కడుగుకొనలేదేమి? ప్రొద్దు పోవుచున్న" దని వెలుపలినుండి భువనేశ్వరి యప్పుడు కేక వైచెను.

అతని చింతాస్రవంతి యాకస్మికముగ నంతటితో గట్టు వడిపోయెను. ఊయెలకుర్చీనుండి యతఁడు చివాలునఁ గ్రిందికి దిగి, మెల్లగ సోపానములనుండి క్రిందికరుదెంచి, తనముఖ ముపై మాతదృష్టి పడకుండునట్లు పెడమొగము వెట్టికొని స్నానమాడ వేవేగ బోయెను.

అనంతరముకూడ పలుచింతలు పలు రూపముల దాల్చి, యతని మానస వీధిని పైశాచికనృత్య మొనరింపసాగెను. కాని దోషమెవరిదని మాత్రమాతఁడు ప్రశ్నించుకొనలేదు. నేఁటి నటుకొక యాశావచన మామెతో నాతఁడు వచింప లేదు. ఏదేని వచించుటకైన యాతఁడామెకుఁ దరుణ మొసఁగ లేదు. తనలావణ్యాఖని నన్యుఁడు తనవశము గావించుకొను చుండెనని నమ్మి; తనకుఁ బ్రాణసమయై మెలంగిన నెలంత నిస్సంకోచముగ వానిజెట్టబట్టినదని విశ్వసించి, పట్టరాని యలుకచే నిరాశచేఁ గలఁగిపోవుచు, నేవెరవుతోపని తటి నపరాధమంతయు లలితపై నారోపించుచు, నామె దుశ్చరి తయని పెక్కుతెఱఁగుల వితర్కించుచుఁ గ్రోధాభిమా నావమూలచే జంద్రశేఖరము తన్నుఁదాను దగ్ధ మొనరించు కొనుచుండెను. పృథ్వీతలమున సందిగ్ధస్వాంతులైన పురుషు లందఱిట్లే తమ కాంతల చరితమునుగూర్చి వితర్కించు

కొనుచు దుశ్చింతానలమున నిట్టులే దగ్ధులగుదురనితోఁచెడిని. మనసుఁ బీడించునది యనుమానమేకదా! నిష్కళంక చారిత్రలుకూడ భర్తృశంకానలమున నాహుతులగుటయు, నిజకల్ప నాపరాధములచే మగలు నిజచిత్తములనుత్తలపాటొందించుకొనుటయు. జూచుచునే యుందుము.

చింతానల దగ్ధమానసుఁడై చంద్రశేఖరుఁడు కతిపయదినములు గడిపెను. నేఁడుకూడ సంధ్యానంతరము తన నిస్తబ్ధయాగారమునం దెప్పటియట్లతఁడు శయనించి యెడద ననలము రగుల్కొని వేగుచుండ నాకస్మికముగ ద్వార పరిసరమునఁ బదముల యలికిడి వినవచ్చెను. చంద్రశేఖరము ముఖమెత్తి చూచెను. దివాలున నాతనిహృత్పిండమెగసెను. అన్నపూర్ణ కరముబట్టుకొని లలిత బావగదిఁ బ్రవేశించి, మెల్లగ నేల మీఁది రత్నకంబళముపైఁ గూర్చుండెను.

అన్నపూ—అన్నయ్యా! మేమిరువురము నీకుఁ బ్రణమిల్లుటకై వచ్చితిమి. తేఁపు మేము వెళ్లిపోవుదుము.

చంద్రశేఖరమేమియుఁ బల్కఁజాలకపోయెను. చూచుచుఁ గూర్చుండెను.

అన్నపూర్ణ—నీయెడ మేమెన్నని యపరాధములను గావించితిమి. అన్నయ్యా! సదయుఁడవై నీవు మాతప్పుల నన్నిఁటిని మన్నించుము.

వీనియందొక్క మాటయైనను నన్నపూర్ణది కాదనియు. నేర్పిపెట్టిన పల్కులనాల్గింటిని తన్నమ్రోల నామె యుచ్చ

రించెననియుఁ జంద్రశేఖరము గ్రహించెను.

చంద్ర—రేపు మీరెచటికి వేంచేయుదురు?

పాప మన్నపూర్ణకుఁ 'వేంచేయుదు' రను పదమున కర్థము తెలియలేదు. ఆమె మెల్లగ లలితనేదియో యడిగి, తోడన ప్రశ్నార్థముఁ దెలిసికొని ,, అన్నయ్యా! పడమటి సీమకు బాబయ్యను తీసికొని మేమందఱము ముంగేరుపోవుదుము. అచ్చట మా గిరీశము మామయ్య మేడయున్నది. మేమచ్చటనేయుండి పోవుదుము. బాబయ్యకు నెమ్మదించిన తరువాత గూడ మేము మరల తిరిగిరాము. కలకత్తా గాలి బాబయ్యకు పడదని వైద్యుఁడు చెప్పినాఁడు.

చంద్ర—ఇపు డాతఁడెట్లున్నాడు?

అన్నపూ—కొంచెము ఆరోగ్యముగానే యున్నాడు.

అనంతర మన్నపూర్ణ లంగాచాటున నుంచుకొనిన కొన్ని నూతనాంబరములను వెలుపలికిఁ దీసి, వానిని జంద్రశేఖరమునకుఁ జూపుచు ,,దొడ్డమ్మ మాయిద్దఱకు కొనిపెట్టిన" దనెను.

లలిత యింతదనుక మౌనము వహించియే యుండెను. అప్పుడు లేచి, యెదుటఁగల మేజాపైఁ దాళము చెవినుంచి, ,,అల్మారు బీగ మిన్నినాళ్లనుండి నాయొద్దనే యున్నది. (చిఱునవ్వునవ్వి)—కాని దానిలో నొకగ్రుడ్డిగవ్వయైన మిగుల లేదు. ఉన్న పైకమంతయు నాచేతి మీదుగనే వెచ్చమై పోయెను" అనియెను.

చంద్రశేఖరము నోటినుండి మాటయేమియు వెల్వడలేదు.

అన్నపూ—వదినా! ఇఁక రా పోదము—చీఁకటి పడి పోవుచున్నది.

లలిత యామె కుత్తర మొసఁగకపూర్వమే చంద్రశేఖర మతితొందరతో "అన్నపూర్ణా! క్రిందికిఁ బోయి అమ్మ నడిగి అన్నకు కావలెనని తాంబూలము తెచ్చిపెట్టుము" అనెను.

వేగమే నిష్క్రమింపఁ బోవుచున్న యన్నపూర్ణ కరమును లలిత పట్టుకొని "అన్నపూర్ణా! నీ విచటఁ గూర్చుండుము. నేను పోయి తెచ్చెద" నని ద్రుతపదయై సోపానములనుండి దిగిపోయెను. కొంతసేపైన పిదపఁ దాంబూలము గొనివచ్చి లలిత దాని నన్నపూర్ణ కరములం దిడెను. అన్నపూర్ణ తాంబూలము నన్న కందించెను.

తాంబూలముఁ గొని, చంద్రశేఖరము నిస్తబ్ధుఁడై కూర్చుండెను.

"అన్నయ్యా! సెల" వని, యన్నపూర్ణ చంద్రశేఖరుని పదములచెంత కరిగి యతనికిఁ బ్రణమిల్లెను. లలిత తాను నిలచియున్న తావుననే భూమిపైఁ బడి ప్రణామ మొనరించి, మరల నన్నపూర్ణ కరముఁ బట్టుకొని మెల్లగ నందుండి వెడలి పోయెను.

తన యాశానిరాశలను, నెగ్గులగ్గులను, నభిమానావమానములను యోజించుకొనుచు వివర్ణవదనుఁడై, విహ్వాలుని వడువునఁ జంద్రశేఖర మట్లే యుండెను. లలిత యరుదెంచి—తాఁ

జెప్పఁదలఁచినదానిని జెప్పి కడపటి వీడ్కోలు గైకొని చని యెను. కాని, యతఁ డేమియుఁ బల్కఁజాలక పోయెను. పలు దినములనుండి మఱుఁగునఁ బడి నెవర్తకను గుఱించి యాతఁ డెంతేని హృదయవ్యథ పడుచుండెనో నేఁ డామెమ్రోల కరు డెంచినను, తాఁ జెప్పవలసిన దేమియు లేనట్లాతఁ డాపుణ్య కాలము కొంచెముఁ దాటఁబెట్టెను. ఎట్టిమాట వెల్వడకుండ నుండవలెననియే లలిత యన్నపూర్ణ నిచ్ఛాపూర్వకముగఁ గూడ దోడ్కొని వచ్చెనని చంద్రశేఖరము గ్రహించెను.

ఆతని యౌవన మంతయుఁ బాండురమైపోయెను. హత బుద్ధిచాడ్పునఁ జాలసేపటివఱకాతఁ డట్లే కూర్చుండియుండెను. అపు డతని కాయమంతయుఁ దేళ్లు కుట్టినట్లుండెను. మస్త కము ఘూర్ణిల్లిపోయెను. కొంతవడికి నిమీలితనేత్రుఁడై చంద్ర శేఖరము పాన్పుపైఁ నొరగెను.

## ౧౧

ఋణగ్రస్తుఁడైన దామోదరునిశరీరము ముంగేరు వనవాయు వులచేనైన స్వస్థతఁ జెందలేదు. వత్సరాధికకాలము గడచిన వెనుక, తన దుర్భరదుఃఖభారమున నవనివీడి యాతఁడు స్వర్గ ధామమునుఁ జేరుకొనియెను. ఆతనియెడ గిరీశునకు నిజముగ మిక్కిలి మక్కువ యుండెను. అంత్యకాలమువఱ కాయువ

కుఁడు దౌర్భాగ్యుఁడైన దామోదరునకు శుశ్రూషలు సలిపి, యతని నెట్టులైన బ్రదికింప శక్తివంచనములేక యత్నించి, విశేషవిత్తమును మందులకై వెచ్చబెట్టెను. కాని, పాప మాతనికి మాట దక్కలేదు.

ప్రాణములను పరమాప్తున కర్పింపకమున్నె గిరీశునిదగ్గ ఱకుఁ జేరి దామోదరుఁడాతని కరములఁ దన కేలు దోయిఁ జేర్చి, కనుదోయినుండి యశ్రువారి యవారిగ దొరఁగ, గద్గదకంఠుఁడై యిట్లు వచించెను. "నాయనా! నా పున్నెము కొలఁది నీవు నాకు లభించితివి. నే నిపుడు మిమ్మందఱను వీడిపోవుచున్నాను. నేను లేకున్నను, తండ్రీ! నీవు నావారల వీడకుము. మనకుఁ గలిగిన గభీరమైత్రిని సన్నిహితబాంధవ్య ముగఁ బరిణమింపఁజేయుము. బిడ్డను నీకు సమర్పణచేసితిని. శుభకార్యమునకు కన్నులారఁ గాంచు భాగ్యము నాకు గలుగ లేదు. చెడుదినములు వాటిల్లి, శరీరదార్ఢ్యము సడలిన హేతు వుచేఁ గాలయాపనమైపోయెను. కాని, పరలోకమునుండి నా యాత్మ మీ పరిణయమహోత్సవమును గాంచి, శాశ్వతా నందసుఖముఁ బడయుడంచు మిమ్మాశీర్వదించును. నాయనా! నీ కింక విశేషముగ నేమి చెప్పుదును? నీయట్టి నిర్మలాత్ముఁ డును, స్వార్థరహితుఁడును, పరోపకారపారీణుండును, కరు ణార్ద్రచిత్తుండును, సత్కులపవిత్రుండును పృథ్వియందు మఱొకండు లేడు. సర్వేశుఁడు నిన్ను సదా రక్షించుఁగాక! వయసునందు నీవు నాకంటెఁ జిన్నవాఁడవయ్యు, బుద్ధియందు

జ్యేష్ఠుఁడవు. కృతజ్ఞతాపరిపూర్ణమైన హృదయముతో నీ కంజలి ఘటించుచుంటిని. నీ వొనరించిన మేలును పరజన్మ మునఁ దీర్చుకొందుఁ గాక!" అనంతరము లలితను దగ్గఱకుఁ బిలచి "అమ్మా! చిరంజీవివి కమ్మ!" అని యామె నాశీర్వ దించి దారాసుతల నాశ్వాసించి దామోదరుఁడు మేను దొరఁగక మున్నె దామోదరుని బ్రస్తుతించెను.

ఆ మహాత్ముని పాదరజము నిజౌదలఁ దాల్చి భక్తిపూరిత స్వాంతుఁడై గిరీశుఁడు హృదయపూర్వకముగ నాతని వేఁడి కోలును మన్నింతునని ఫాల్గున మొసఁగెను. అతఁడు విగత జీవుఁడైనయనంతరము విధికృత్యమునకు వగవవలదవి పార్వతీ లలితాన్నపూర్ణాదుల నూరడించి, సుతులులేని దామోదరు నకుఁ దానే సుతుఁడై, విధ్యుక్తముగ నాతనికి శ్రాద్ధకృత్య ముల నెరపెను.

దామోదరుని గృహమునం దద్దెకున్నవారి కడనుండి యతని యోగక్షేమముల నపుడపుడు భువనేశ్వరి యెఱుంగు చుండును. కతిపయదినములకు మున్నాతఁడు పరమపదించె నను దుఃఖవార్త విని యా యువిద చాల దుఃఖించెను.

తదనంతర మామెకుఁగూడ ఘోరవిషాద మాపాదిల్లెను. దారాసుతాదులనే గాక, తన యూపాయలసంచులఁ గూడ నెచటివాని నచటనే విడిచి తోడివాఁడగు దామోదరునిఁ వీడియుండుటఁ దగదని తాఁబోలు, వయిళంబ జని యాతనిఁ గలసికొన మానసీయుండఁగు శ్రీ శ్యామసుందరుఁడు పరలోక

యాత్ర సలిపెను.

వైధవ్యజనిత దుర్భరసంతాపముచే భువనేశ్వరి యున్మత్త ప్రాయ యాయెను. ఆమె సంసారభార మంతయుఁ బెద్దకోడ లిపై నిడి రాఁబోవు వత్సరమునఁ జంద్రశేఖరము వివాహతిథి నిర్ణయమైన యనంతరము తనకుఁ గబురంపినయెడల వచ్చి శుభకార్యము నెరవేర్చి యరుగుదునని చెప్పి వారణాసిపుర మున కరిగెను.

తా నభిలషించినట్లు నలువదివేల రూపాయల నందుకొన వలెనను నిబంధనమునకు భంగము కలుఁగకుండఁ గొడుకునకు సంబంధమును స్థిరపఱచియే శ్యామసుందరుఁడు మృత్యువాతఁ బడెను. ఆకస్మికముగ నాతఁడు కాలధర్మ మొందుటచే శుభ కార్యమునకు భంగము కలిఁగెను. సంవత్సరము ముగియు దనుక పరిణయము నిలుపవలసివచ్చెను. కాని పిల్లవైపువారి కీఁక విలంబన మాచరించుట చెల్లదు. బాలిక ప్రాయవతియై యే ప్రొద్దు పెద్దమనిషి యగునో యని యామె తలిదండ్రులు భయ మందుచుండిరి. అందుచేతనే పెండ్లివారు నిన్నటిదిన మరుదెంచి, మరల తాంబూలాదులను గ్రహించి, భావిజా మాత నాశీర్వదించి చనిరి. తుద కీమాసములోనే శుభ కార్యము నిశ్చయింపఁబడెను.

జననిని గాశీనుండి తీసికొనివచ్చుటకై నేఁడు చంద్రశేఖ రుఁడు ప్రయాణ మగుచుండెను. అల్మారునుండి తనకు వలసిన వస్తులఁ దీసి, వానినిఁ దన ప్రయాణపుపేటికయందు సర్దుచు,

బహుదినముల యనంతరమున నాతఁడు లలితను దలంచు కొనెను. అట్టిపనుల నన్నిటి నతనికొఱకై లలితయే చక్కఁ బెట్టుచుండెడిదికదా !

లలిత మొదలగువారు ముంగేరున కేగి సుమారు మూఁడు వత్సరము లయ్యెను. ఈలోపుగ వారిని గుఱించిన వార్త లేమియుఁ జంద్రశేఖర మెఱుఁగఁడు. ఎఱుఁగవలెనని యతఁడు ప్రయత్నమైన సల్పియుండలేదు. అట్టు ప్రయత్న మొనరింప వలెనను నిచ్ఛయే యాతనికి లేకపోయియుండవచ్చును. లలితపైఁ జంద్రశేఖరమునకు దురంతజుగుప్సాభావము జనించినను, నిపు డామె యెట్లుండెనో యెట్టులైనఁ దనకుఁ దెలియ వచ్చిన బాగుండుననను వాంఛ నేఁ డాతని కాకస్మికముగఁ గల్గెను. నిజముగ నామె సుఖియై యుండుననియే యాతఁడు నిశ్చయించెను. ఏలనన, గిరీశుఁ డతు లైశ్వర్యసంపన్నుఁడని యాతఁ డెఱుంగును. అయినను బరిణయ మెపు డయ్యెనో, లలిత భర్తనుగూడి కాపుర మెట్లొనరించుచుండెనో, యామె కేమైన సంతానప్రాప్తి కలిఁగెనేమో యను విషయములను విన నాతనికిఁ జాల కౌతుకము కలిఁగెను.

దామోదరుఁ డింట నద్దెకున్నవారు రెండుమాసములకుఁ బూర్వ మిల్లు కాళీచేసి నాగపుర మరిగిరి. అందుచే ముంగేరు వార్తలుఁ దెలుపువా రందులేరు. కాని గిరీశుని వర్తమానములు చారుమతి జనకునకుఁ దెలియుచుండునని గ్రహించి, లలితవిషయ మాతని నడసి తెలిసికొనవలెనని చంద్రశేఖ

రము యోజించెను. అంత నతఁడు పెట్టెయం దుంచవలసిన వస్తువుల నట్లే యుంచి, శూన్యనృక్కుల గవాక్షబాహిరము నకు సారించుచు నిలువఁబడి భావించుచుండ, వృద్ధపరిచారిక వెలుపలనుండి "చిన్నబాబయ్యగారూ! అన్నమ్మగారి తల్లి గారు మిమ్మొకసారి పిలువమన్నారండి" అని కేక వైచెను.

చంద్రశేఖర మీవలి కరుదెంచి యాశ్చర్యముతో "ఏ యన్నపూర్ణ తల్లి ?" యని ప్రశ్నించెను.

"ఎరగ దేమిటండీ? మన పొరుగింటివారి చిన్నమ్మాయి అన్నమ్మగారు—ఆమె తల్లి. ఆమె పేరు పార్వతమ్మగారు కాదా ? వా రందఱు నిన్నరాత్రి తిరిగివచ్చినారండి."

"ఆమ్మగోరు! ఆయిడిపేరు మరిగంటే, మరిగంటే—పార తమ్మగోరు. జాతిలోనుంచి తప్పించేశారని అత్తమాను ఒకే మోత్తరుగా యేడుత్తో వుండేది కాదుటుండీ—గ్యాపకం వచ్చిందా ? ఆరంతా నిన్న రేత్తిరి తిరి గొచ్చాశారండి."

"ఓహో! నడువుము. వచ్చుచున్నాను" అని పలికి తోడనే చంద్రశేఖరము క్రిందికి దిగిపోయెను.

అపుడు సంధ్య గడువఁజొచ్చెను. దామోదరు నింటఁ జంద్రశేఖరుఁడు కాలిడఁగనే దిక్కులు పిక్కటిల్లునట్లు గోలు గోలుమను రోదనవినాద ముత్పన్నమయ్యెను. బిట్టుగ రోదన మొనర్చు దైన్యస్వరూపమో యనునట్లున్న పార్వతిని గాంచఁగనే చంద్రశేఖరమునకుఁ బట్టరాని దుఃఖము వచ్చెను.

కాని, పాప మాతఁ డీవఱిలో నెవ్వరి నోదార్చి యెఱుఁగడు. అందుచేఁ బరామర్శ సేయవలసిన పద్ధతు లాతనికిఁ దెలియవు. కాని, యందులకై ముఖ్యమైన నిబంధనలు కొన్ని సంఘ మందుండు టాతఁ డెఱుంగును! అందుచేఁ దోడనే "అయ్యో! పిన్నీ! ఇట్లుచేసి పోయినాఁడా చినబాబయ్య" యని పాప మాతఁడుకూడ బారుమని యేడ్చుచు చివాలున నామెయొద్ద జతికిలఁబడిపోయెను. చంద్రశేఖరునిమాట వినగనే పార్వతి రోదనము మఱింత హెచ్చుస్థాయిని బయల్వెడలెను.

ఓదార్పవలసిన చంద్రశేఖరము గూడ నిజముగఁ జాల వనటఁ జెందెను. దామోదరునివంటి మహాత్ము నాతఁ డెన్నఁడు గాంచియుండలేదు. ఆతని యకాలమృత్యువునకు సనాతనధర్మ నామోచ్చారణము సలిపి, పీకిపీకి పీడించిన తన క్రూరసంఘమే యుత్తరవాది యని బుద్ధిమంతుఁ డగు చంద్రశేఖరుఁడు గ్రహింపఁజాలకపోలేదు. అతఁడు కొండొకవడి శోకించుక దుఃఖ మపనయించుకొని మెల్లగఁ గన్నుదమ్ములఁ దుడిచి కొనసాగెను. అతఁ డొక్క దామోదరునికొఱకే వగచుట లేదు—పితృవియోగదుఃఖమందుఁ గూడ నాతఁడు పార్వతి మ్రోల మఱొకమా ఱభిభూతుఁ డాయెను! రెండుదుఃఖములు కలిసి, చంద్రశేఖరమును మఱింత బేలగఁ జేసివైచినను, నొక దానితో మఱొకటి కలిసి వచ్చి చాల సమయమును కూడఁ దీసివైచెను.

సంధ్య గడచిపోవఁగనే లలిత దీపము వెలిగింప నరుదెం

చెను. దూరమున నిలచి, గళమున నంచలిఁ జుట్టి, బావ కామె ప్రణామ మాచరించెను. ఆమె క్షణకాల మెందులకో యటనే నిలచియుండి, మెల్లగ వెడలిపోయెను. పదునేడేండ్ల ప్రాయఁపు పరకామినిని గన్నెత్తి చూచుటకుఁ గాని, పలుకరించుటకుఁ గాని చంద్రశేఖరమునకు సాహసము చాలలేదు. కాని, శ్రీకంటికి ద్యోతకములైన యా లతాంగి యంగప్రత్యంగము లామె మునుపటికంటెఁ బెద్దదాయెననియు, నెందువలననో యామె కసుంగడు కృశించి యున్నదనియు నాతనికిఁ జెప్పక చెప్పెను!

దీర్ఘరోదనానంతరమునఁ బార్వతి డగ్గుత్తికతోఁ జంద్రశేఖరు నుద్దేశించి యిట్లనెను. "నాయనా! నీ పినతండ్రిని మింగి బూయివలె నున్నాను. పాపాత్మురాలనగు నాకు దైవమాయు వెక్కుడు వోసెను. బిడ్డ లేమైపోదురో యని యెట్టి దారుణకృత్యమునకుఁ దలపడఁ జాలకున్నాను. వా రెక్కడ బెంగటిల్లిపోదురో యని మొండినై ప్రాణములు నిలుపుకొంటిని. నాయనా! లేకున్న నా కీ పాడుబ్రదు కేల? ఇఁక నొక్క-దాన నిచట నుండఁజాలను. ఈ కొంప నెంతకో యొకంత కమ్మివేసి ముంగేరు పోయి పిల్లదానినే కనిపెట్టుకొని యుండి దినములు గడపవలెనని యనుకొనుచున్నాను. ప్రేగును మొదలో వైచితినికాదా నాయనా! చిన్నవాఁడు చాల బుద్ధిమంతుఁడు 'మాయొద్దనే యుండు డని' ప్రాకులాడుచున్నాడు. ఆదినుండి మీ బాబయ్య కీ యింటిమీఁదనే దృష్టి యుండెడిది. ఎట్లయిన

తమ్మునియొద్దనుండి దీనిని గొనవలెనని వారి కుండెడిది. అన్నయ్యతోను అమ్మతోను ఆలోచించి తగిన ధరకు మీరు దీనిని ఖండించుకొని తీసికొనినయెడల నిది పరాయివారిదానివలె మాకు కన్పట్టక యుండును. పెద్దలనాఁటి కొంప చేయిజారిపోయెనను చింత యుండదు. బుద్ధిపుట్టినపు డెప్పుడైన వచ్చినను, ఒకటి రెండు దినములు మే మిందే యుండి కాలక్షేపముఁ జేయవచ్చును. నాయనా! నాయుద్దేశ మిది. పిన్నిపై నీ కభిమాన మున్నయెడల ఈయొక్క యుపకారము చేసి పెట్టుము బాబూ!"

"అమ్మతోఁ జెప్పి చేయవలసిన పని జేయుదు" నని చంద్రశేఖరు ముత్తర మొసఁగఁ, గన్నుల నీరు నించుచు డగ్గుత్తికతోఁ బార్వతి మరల నిట్లనెను: "నాయనా! అమ్మగతి నా గతి యొకటే యైపోయినది కాదా! మమ్ముల నిర్భాగ్యరను దుఃఖసముద్రములో ముంచి అన్నదమ్ము లిద్దరు లేచిపోయిరి. ఏమంత పెద్దకాలము వచ్చెను నాయనా! వారికంటెఁ బెద్దవారు భూమిలో ఱాళ్లవలె బ్రదుకుటలేదా? ఇరువుర మొక్క నోమే నోచుకొంటిమి. కని, పెంచినని బిడ్డల శుభకార్యములైనఁ గండ్లార (గద్గదస్వరమున) చూడలేదు కదా నాయనా! ఇద్దరు కూడ పిల్లదాని కార్యము నింతలోనే చేయక తప్పినది కాదు. కాని కన్నీటితోడనే కన్యాధార పోయవలసి వచ్చెను. ఆయన యున్న నెంత పొంగిపోయెడివారో కదా యని వాపోయితిమి. మనవా రందఱును,—ముఖ్యముగ బిడ్డ లలిత ,మా

బావ లేనిదే పెండ్లియేమి? ఒక శుభలేఖ వ్రాయింపు' మని చెప్పినది. మన సంతయు వికలమై యుండుటచే నొక్క యుత్తరమైనను వ్రాయింపలేకపోతిని. మన సంతయు పరిపరి విధములఁ బోవును నాయనా! ఏమని చెప్పుదును బ్రదుకు?— అయిన, అబ్బాయీ! అమ్మ యింతలో వచ్చునా?"

"అమ్మను తీసికొని వచ్చుటకై నేనీ రాత్రి కాశీ పోయెదను."

అనంతరము చంద్రశేఖరము తనకు నిశ్చయమైన పెండ్లి సంబంధమును గుఱించియు, వారిచ్చెడనన్న కట్నమును గుఱించియు, లగ్నము నిశ్చయమగుటను గూర్చియుఁ దెలిపి యింక ననేక విషయములను పార్వతి యూకొట్టుచుండ వివరించెను.

పార్వతియొద్ద చంద్రశేఖరము సెలవు గైకొనునప్పటికి వసుంధరాసుందరిని తన జ్యోత్స్నసుధచేఁ దనుపుచు సుధాకరుఁడభ్రతలమునఁ దోఁచెను. గిరీశుఁడపుడు మేడపై నుండి దిగివచ్చి, తన యక్క మనోరమ యాలయమున కరిగెను. పార్వతి యాతనిఁ జూపి, చంద్రశేఖరు నుద్దేశించి యిట్లనెను. "నాయనా! గిరీశముతో నీకుఁ బరిచయము లేదా? ఇటువంటి చిన్నవాఁడు లోకములో మఱొకఁడు పుట్టలేదు. మా మణిపూసకు వెన్నపూసవంటి మనసుఁగల వరుఁడు లభించెను."

"అవునవును! అందులకు సందేహమా? నేనాతని సంగతి

చాలగ నెఱుఁగుదును!—అతనితో నాకుఁ గొంచెము పరిచయము కూడ నున్న" దని దృతగతిఁ జంద్రశేఖరము వెలుపలికి వెడలిపోయెను. కాని, బహిర్మందిరము సమ్ముఖమునుండి యరుగునప్ప డతఁ డాకస్మికముగ నాగిపోవలసి వచ్చెను.

చీఁకటిగా నున్న యా తావునఁ దలుపుమూల లలిత నిలచియుండి, యప్పుడు ముందున కరుదెంచి, "మాట!—అత్తగారిని దీసికొనివచ్చుటకై నేఁడే పోవుదురా?" యని ప్రశ్నించెను.

"అవును"

"ఆమె చాల జేలయైపోయెనా?"

"అవును. ఉన్మాదినివలె నైపోయెను."

"మీ యారోగ్య మిప్పుడు బాగుగనే యున్నది కదా?"

"బాగుగనే యున్న" దని యింకఁ దడయక చంద్రశేఖరము కడు వడిగ నం దుండి వెడలిపోయెను.

పథమునఁ బడఁగనే యాపాదమస్తక మాతని యొడలంతయు ననిర్వచనీయ లజ్జాజుగుప్సలతో రోమాంచితమై పోయెను! అతఁడు తాను పరకాంతకైమోల నిలువంబడవలసి వచ్చినందులకుఁ గడు చింతించి యొకరుని తగులొ్కని పోయిన కులట గాలి తనకు సోకినందునఁ దా నపవిత్రుఁ డైనట్లుగా యోచించెను. పిదప వడివడిగ నిజాలయమునకుఁ జని సామానును నెట్టెట్లో పెట్టెలో సర్దికొనెను. రైలువేళ కింకను నాలస్య ముండుట తెలిసి, యొకమా రతఁడు శయ్యపై నొరగి, లలిత

విషాక్తస్మృతిని దగ్ధమొనరించి నిశ్శేషము గావింతునని శపథ మొనరించి, హృదయస్థ రంధ్రరంధ్రములందు ఘృణా దావానలమును జ్వలింపజేసెను. అద్దానానాయాతనమున నాతఁడు లలిత ననరాని మాటలచే దూషించెను. చెప్పనేల, 'వ్యభిచారిణీ! కళంకినీ!' యని కూడ నామెను దూఱుట కాతఁడు సంకోచింపలేదు. మాటలసందర్భమునఁ బార్వతి ముంగేరు వివాహవిషయమును గుఱించి చెప్పుచు, "మా బావ లేనిదే పెండ్లియేమి? ముఖ్యముగ నాతని నీ శుభకార్య మునకుఁ బిలిపింపవలయును. శుభలేఖ వ్రాయింపుము" అని లలిత పల్కెనని వాక్రుచ్చిన నుడువులు జ్ఞప్తికి వచ్చి, రవులు చున్న యాతని క్రోధానలకీలలను మఱింత ప్రజ్వరిల్లఁజేసెను. అప్పుడు జంద్రశేఖరుఁడు క్రోధావేశముతో ఘూర్ణిల్లుచు "లలితా! ఏమే నీ సాహసము! నీ నిర్లజ్జ! నీ స్పర్ధ! నీ మిట్టి పాటు! నీ భయరాహిత్యము!—పాపీయసీ! నిన్నుఁ దలంచి నంతనే పాపము చుట్టుకొనును. నీవును, నిన్నుఁ జేరఁదీసిన యా పలుగాకియుఁ గూడ నచిరములో నశింపకుందురా? ఇంత దురంతమా? ఇంత తెగువయా? ఇంత దౌష్ట్యమా? ఇంత దుర్మార్గమా?" అని చంద్రశేఖరుఁ డున్మత్తప్రాయుఁడై పోయెను!

## ౧౨

చంద్రశేఖరుఁడు విశ్వేశ్వరధామమునుండి తల్లిని వెంటఁగొని వచ్చిననాఁటికి తాతని పరిణయమునకుఁ బదిదినములు గడువు మాత్ర ముండెను.

రెండు మూఁడు దినములు గడచిన పిదప నొకనాఁటి ప్రాతః కాలమున లలిత భువనేశ్వరిచెంతఁ గూర్చుండి యామెకై బూదెయందు వత్తులు చేయుచుండెను. జననికడ లలిత యుండు టెఱుంగక, యేదియో పనిమీఁద "అమ్మా!—" యని చంద్రశేఖర మామె యున్న గదిఁ బ్రవేశింపఁబోయి చకితుఁడై యట్టె నిలువంబడిపోయెను. నతముఖియై వత్తులఁ జేయు లలిత యపుడు చివాలున లేచి యొకప్రక్కగ నిలువంబడెను.

"ఎందుకు నాయనా?" యని భువనేశ్వరి తనయు నడిగెను.

తా నెందుల కచటి కరుదెంచెనో మఱచి చంద్రశేఖరము "ఏమియు లేదు. ఊరకనే పిలిచితి" నని వడివడిగ నందుండి వెడలిపోయెను. లలితముఖ మాతనికి గోచరము కాలేదు. కాని, యామె కరపల్లవములపై నాతనిదృష్టి పడెను.—అవి నిరాభరణములై యుండెను. ఒకటిరెండు గాజులుతక్క నికే మియు లేవు! "ఇదేమి వింత! లలిత యైశ్వర్యమంతయు రెండుగాజులందే యిమిడి పోయెను కాఁబోలు! గిరీశునివంటి యమేయధనసంపన్నుని కర్ధాంగి యయ్యు, నీమె యలంకార

శూన్యమై యుండనేల ? ఓహో ! మఱచితిని ! ఇది బ్రహ్మ సమాజమువారి నాగరకాచారమై యుండు" ననుకొనెను.

ఆనాఁటి సంధ్యాసమయమున ద్రుతగతిఁ జంద్రశేఖరము నిజాగారమునుండి క్రిందికి దిగుచుండ లలిత సోపానములపై నెదురై యొకప్రక్కకొత్తిగిల్లెను. అప్పు డామెయత్యంత సంకోచముతో నేదియో చెప్పనుంకించి, బావ సమీపమునకుఁ రాఁగనే మృదుస్వరమున "మీతో నొకమాటఁ జెప్పవలసి యున్న" దనియెను.

శేఖరుఁడు ముహూర్తమాత్ర మచ్చో నిలచి, విస్మయ స్వరమున "ఎవరితో?—నాతోనా?" యనియెను.

లలిత మెల్లగ "అవును మీతోనే!" యనియెను.

"ఇఁక నాతో నీకు మాటలేమి!" అని చంద్రశేఖరము మునుపటికన్న నెక్కుడు వడిగ దిగిపోయెను.

లలిత యచ్చోఁగొంతసేపు నిర్వాక్కై నిలువంబడి యుండి, నిట్టూర్పు పుచ్చి మెల్లగ నందుండి వెడలిపోయెను.

మఱునాఁ డుదయము కాల్యకృత్యములను నిర్వర్తించు కొనిన పిదపఁ జంద్రశేఖరుఁడు తేనీరు ద్రావి తన విశ్రామ మందిరమునఁ బడకకుర్చీపై నొరగి నాఁటి వార్తాపత్రికఁ జదువుకొను చుండెను. అపుడతఁడు పదముల యలికిడి విని తలయెత్తఁగా గిరీశుఁడు గదిలోపలఁ బ్రవేశించుట విస్మయముతో విలోకించెను. గిరీశుఁడు చంద్రశేఖరునకు వినయపూర స్సరముగ నమస్కార మాచరించి, సమీపమందున్న కుర్చీ

నొందు ముందునకు లాగుకొని, యందుఁ గూర్చుండెను. చంద్రశేఖరుఁడు ప్రతి ప్రణామమాచరించి, వార్తాపత్రిక నట నుంచి యతనిదెస జిజ్ఞాసతో వీక్షింపసాగెను. ఒకరొకరి కీవఱలో ముఖపరిచయము మాత్రమే యుండెకు కాని, స్నేహ మేమియు లేదు. ఒండొరులతోఁ బ్రసంగించు కొనవలెనను కుతూహలము నేఁటిదనుక నేరికిఁ గలుఁగలేదు.

గిరీశుఁడు సమయము వృథా గడపివేయక వెంటనే "అయ్యా! చంద్రశేఖరము గారూ! పనిమీఁద నేను మీదర్శనమునకై వచ్చితిని. మీసమయమొకింత నష్టమొనరింప సాహసించినందులకు మన్నింతురుగాక! మాయత్తగారు తమ యభిప్రాయమును మీకీవఱలోనే తెలిపి యుండిరఁట—గృహమును మీకు విక్రయింపవలెనని యామె కోరుచున్నది. ఏదో యొకవిధముగఁ గార్యము త్వరలో సానుకూలమైన యెడల, నీ మాసములో నాభార్యను నన్నుఁ గలసి ముంగేరు రావలెనని యుద్దేశించి, మీయభిమత క్షేమని యడిగి రమ్మని యామె నన్నంపినది" అని పల్కెను.

గిరీశుని వీక్షించినంతనే చంద్రశేఖరుని హృదయమధ్యమున భీషణ ఝంఝానిల ముత్పన్నమాయెను.—ఒడలంతయు జ్వలించి పోయెను. అతని మాటలు వానికేమి రుచించినవి కావు. అప్రసన్నవదనుఁడై యాతఁడు "అయ్యా! మీరు వచించినట్లు భార్యతోఁ గూడఁ, జిన్ననాఁట నుండి యామెను పెంచిన యమ్మను గొనిపోవఁ దలఁచు టుత్తమకార్యమే!

కాని, యావిషయమును తమకు నా కెఱింగింప నక్కఱలేదు. ఇక గృహమును గొను విషయమందురా—దానిని గుఱించి నే నేమియుఁ దమతోఁ జెప్పఁజాలను. నాతండ్రిగారు లోకాంతర గతులగుటచే నాయన్నయే యిపుడు మాయింటికిఁ బెద్ద. ముందుగ నాతని యభిప్రాయమేమో యెఱుంగు టావశ్యకము" అనియెను.

గిరీశుఁడు—(మందహాస మొనరించి)—మీరనిన మాట నిజమే. కాని, యీవిషయము తామే వారితోఁ జెప్పిన, బాగుండునని మా యభిప్రాయము.

చంద్ర—నే నాతనితోఁ నేమియుఁ జెప్పనక్కఱ లేదు. దామోదరముగారి వ్యాపారము లన్నియు నిపుడు మీ మీఁదుగా జరగుచున్నపుడు, మీరు చెప్పినను చాలును!

గిరీశు—నేనే చెప్పవలసిన అట్లే చెప్పుదును. కాని తాము పూనుకొనని యెడల మిగుల నవలీలగా నీకార్యము నిర్వహింపఁబడఁ గలదని నాచెల్లెలు చెప్పినది.

చంద్రశేఖర మింతదనుక కుర్చీపై నొరగి ప్రసంగించుచుండెను. ఇపు డాతఁడు లేచి కూర్చుండి "ఎవరు చెప్పిరి?" అని ప్రశ్నించెను.

గిరీశు—నా చెల్లెలు.

చంద్ర—(విస్మితుఁడై)—మీ చెల్లె లెవరు? మీ కొకచెల్లె లుండెనని నే నెఱుఁగనే!

గిరీశు—ఎఱుఁగకపోవుట యాశ్చర్యమే! కాని, మేమిర్వుర

మొకే మాత గర్భమున జనింపలేదు.

చంద్ర—(ఆశ్చర్యము)—ఆమె యెవరు?

గిరీశు—ఆశ్చర్యపడెద రేల? నాచెల్లెలు లలిత.

అనిర్వచనీయ విస్మయముచే జంద్రశేఖరము హతబుద్ధియై పోయెను. తదుపరి గిరీశుఁ డేమిచెప్పెనో గాని, యందొకించుకైన వాని వీనులఁ బడలేదు. కొండొకవడి యతఁడు తన విహ్వలస్మృత్కుల ప్రోలసున్న యువకుని వదనమండలమునఁ బఱపి "గిరీశము గారూ! నాప్రశ్నకు మన్నింతురుగాక! లలిత మీ యర్ధాంగి కాదా?" మీ కిరువురకుఁ బరిణయమాయెను కాదా!" యనియెను.

గిరీశు—అయ్యా! పరిణయము జరగినది ఆమెకును నాకును కాదు. వారంజఱిని తామెఱిఁగియే యున్నారు కదా—నా కర్ధాంగి యైనది అన్నపూ—

చంద్ర—కాని, అన్నపూర్ణకును మీకును వివాహమను మాటలేమియు జరగి యుండలేదే!

గిరీ—జరగి యుండకపోవుట నిజమే! దామోదరుఁడుగారు పరలోకగతులగుటకు మున్ను ప్రేమపూర్వకముగ నన్ను దగ్గఱకుఁ జేరి అన్య సంబంధమును వెతుక వలదనియు, తమ కుటుంబమునుండి విడిపో వలదనియు నన్నుఁ వేడి యుండిరి. అట్లే చేసెదనని నేను మాట యిచ్చితిని. వాగ్దానము దప్పుటనుచితము కాదా?—దామోదరుఁడుగారు శయ్యాగతులై యున్నపు డొకనాఁడు సోదరి లలిత, తనపరిణయ మంత్రకు

మున్నే జరగియుండె ననియు, తనపతి సజీవుఁడై యున్నాఁడనియు, నీ విషయము నిజముగ నొరులెవ్వరు నెఱుఁగరనియు నాతో రహస్యముగాఁ జెప్పెను. ప్రాయశః యీవిషయ మన్యులెవ్వరు విశ్వసింపరు. కాని, నేనామె మాట యొక్కటయిన నమ్మకుండఁజాలను. ఆఁడుదానికి రెండు వివాహములు కూడవు కాదా?—అదేమి? అట్లు విచారించుచున్నారు!

చంద్రశేఖరుని కనుదమ్ములు రెండును బాష్పాకులములై పోయెను. అశ్రుధారలవారిగ నాతని యక్షులనుండి వెల్వఁగ ప్రవహింప దొడఁగెను.

గిరీశుఁడు నిర్విణ్ణుఁడై పోయెను. ఏమియు ననలేక అనిమేష లోచనుఁడై చంద్రశేఖరుని వీక్షించుచు, నతఁ డట్లే యుపవిష్టుఁడై యుండెను. లలితనాథుఁ డెవ్వఁ డుండురా యని యాతఁడు యోజించుచు, నీతఁడే యై యుండునని సందియమందు చుండువాఁడు. నేఁడు గిరీశుఁడు లలిత ప్రాణపతిని నిశ్చయముగ గుఱుతింపఁ గలిఁగెను! చంద్రశేఖరము కొండొకవడికిఁ జైతన్యుఁడై కన్నీరు దుడిచికొని, గద్గదస్వరమున "కాని, తాము లలితను ప్రేమించి యుంటిరి కాదా!" యని యాతనిఁ బ్రశ్నించెను.

ప్రశ్న వినఁగనే గిరీశుని ముఖమండలముపైఁ బ్రచ్ఛన్న వేదనాఛాయఁ దోఁచెను. కాని, పరక్షణమందే యాతఁడు చిఱునవ్వు నవ్వి మృదుస్వరమున "ఆప్రశ్న కుత్తర మొసఁగుటన్నావశ్యకము, ప్రేమ యెంత మహత్తరమైన దయినను ఎఱిఁగి

యెవఁడును అన్య వివాహితను ప్రేమించి పరిణయము చేసి కొనకుండ—పోనిండు; ఆవిషయ మిపుడెందులకు? నాతోఁ బుట్టువ యని యెవర్తుకను భావించుచుంటినో యామె శుభ కార్యము గుఱించిన యీమాట లెందుకు? ఆమె సదా సుమాంగల్యవతి కావలెననియే యగ్రజుఁడ నగు నే నభిల షించు చుందును" అని పల్కి, మందస్మితముఖుండై లేచి, "బావగారూ! నేఁటికి సెలవు. మఱొకదినము మీదర్శనము నకు వత్తును. చదువుకొనుచుండ, సమయము నష్టమొనరించి నందులకు మన్నింపు"డని యత్యంత వినయపూర్వకముగఁ జంద్రశేఖరమునకుఁ బ్రణమిల్లి నిష్క్రమించెను.

గిరీశునియెడఁ జంద్రశేఖరము ప్రథమమునుండి విద్వేషముఁ బూని యుండెను. క్రమక్రమముగ నావిద్వేషము నిబిడ జుగుప్సగఁ బరిణమించెను. ఏకాంతమున నాతఁడా యువకుని నెట్లాక్రోశించి యుండెనో మన మెఱుఁగుదుము. కాని, నేఁడు గిరీశుని ప్రస్థానానంతరమునఁ జంద్రశేఖరము తన యాసనము నుండి లేచి వినమ్రుఁడై భూమిపై సాగిలఁబడి, భక్తిపూరిత స్వాంతుఁడై, యా యపరిచిత బ్రహ్మసమాజ యువకు నుద్దే శించి ప్రణామసహస్రంబు లాచరింప దొడంగెను. మనుజుఁడు నిభృతమున నెట్టి యుత్కృష్ట స్వార్థత్యాగముఁ గావింపఁ గలఁడో, స్మితముఖుండై యెట్టి కఠోరదాహ్గానముఁ బాలన మొనరింపఁగలఁడో చంద్రశేఖరుఁడు నేఁడు ప్రథమమునఁ గాంచెను.

అపరాహ్ణ సమయమున భువనేశ్వరి, నిజాగారమున మేజాపైఁ గూర్చుండి లలిత సహాయమున నూతనాంబరములను వరుసవరుసలుగ నమర్పదొడఁగెను. చంద్రశేఖరమపు డాగదిలోఁ బ్రవేశించి, తల్లితల్పముపైఁ గూర్చుండెను. నేఁడాతఁడు లలితనుగాంచి, తత్తరపాటునఁ బలాయితుఁడు కాలేదు. తనయుని గాంచి భువనేశ్వరి "ఏమి నాయనా!" యనెను.

చంద్రశేఖరమేమియు నుత్తరమొసఁగలేదు. ముందుఁగల నూతన దుకూలములను విలోకించుచుఁ గొంతసేపైన పిదప నాతఁడు "అమ్మా! ఏమిచేయుచుంటివి ?" అనియెను.

"క్రొత్తబట్టలను పెండ్లి చుట్టములలో నెవరెవరికి పెట్టవలెనో లెక్కజూచుచుంటిని. ఇంకను కొన్నిఁటిని గొనవలెననుకొనెద. కాదా అమ్మా?"

అవునని సూచించుచుఁ లలిత శిరమూపెను.

చంద్రశేఖరము — (మందస్మిత వదన మండలుఁడై) — అమ్మా! ఇక పెండ్లి జేసికొనకుండుటే మేలుకదా ?

భువనేశ్వరి—(చిఱునవ్వుతో)— మేలుకాకేమి బాబూ! గొప్పగుణముల బిడ్డవు కావా ?

చంద్ర. — (స్మితముఖుఁడై) — అమ్మా! నీ వాక్యము పరిహాసము నా గుణములు గొప్పవే యగుగాక! కాని, యిఁకఁ బెండ్లి ఎందులకు ?

భువనేశ్వరి—(గంభీరవదనయై) ఒకించుక యుచ్చస్వరమున అదేమిమాట ? ఇట్టియమంగళపుమాటలు నోటరానీయకుము.

చంద్ర—అమ్మా! ఇంతవఱకు నోటరానీయనే లేదు. కాని, యింక రానీయకుండ నుండఁజాలకున్నాను. ఇంకను మిన్నకుంటినేని, మహాపాతక మాపాదించును.

తనయుని మాటల యర్థమును హృదయంగమముఁగావించుకొనఁజాలక భువనేశ్వరి, వెఱఁగు దోఁచు నెమ్మోమున నాతని విలోకించుచు నిలువంబడియుండెను.

చంద్ర—అమ్మా! నీ యీ తనయుని యపరాధముల నెన్నేని సైరించియుంటివి. ఈయపరాధమునుగూడ మన్నింపుము. రాఁబోవు శుక్రవారము నా వివాహము నిశ్చయింపబడినదికదా. నే నా సంబంధమునొల్లను. ఆపరిణయము నా కక్కఱలేదు.

తనూభవుని వచనములనువిని, అతని ముఖలక్షణములను వీక్షించి భువనేశ్వరి నిజముగ నుద్విగ్నయైపోయెను. కాని, ఆమె తన యుద్విగ్న భావము నణంచుకొని యిట్లనెను. "మంచిది. నీయిష్టానుసారమే యగునులే! నీవిప్పుడు నీగదిలోనికిబోయి, యేదైనఁ జదువుకొనుము. నాచేతినిండుగఁ బని యున్నది. విసిగింపకుము."

చంద్రశేఖరుఁడు మఱొకమాఱు చిఱునవ్వు నవ్వుటకు వ్యర్థ ప్రయత్నముఁజేసి, శుష్క స్వరమున నిట్లనెను. "అమ్మా! నీతో నేను నిజము వక్కాణించుచుంటిని. నిజముగ నా కాసంబంధ మక్కఱలేదు. అట్లని, యన్నద్వారా వారికి వర్తమాన మంపుము.

భువ—నిశ్చయమైన సంబంధము నీ కెందులకక్కఱలేదు. పెద్దమనుష్యులతోఁ జెలగాటములా? పిల్లాటలనుకొంటివా?

చంద్ర—(నవ్వుచు)—అమ్మా! పిల్లాటలు కావు. కనుకనే యిట్లనుచుంటిని.

భువనేశ్వరి కీమాటలు చాల భీతికలిగెను. క్రుద్ధస్వరమున నామెఁ "ఏలనిట్లు పల్కుచుంటివి? జరగినదేమో నాకు స్పష్టముగఁ దెలుపుము. ఇట్టి వంకరమాటలు నాకు గిట్టవు" అనియెను.

చంద్ర—(మృదుస్వరమున)—అమ్మా! ఏమి జరిగెనో మఱొకదినమున విశదముగఁ దెలుపుదును. ఈవేళ కాదు.

"మఱొక దినమువఱకు గడువు కావలెనా యీ రాద్ధాంతమునకు?" అని యామె బట్టలదొంతరల నొకవైపునకు బలముగఁ ద్రోసివైచి "అట్లైన నన్నీదినమే కాశీ పంపివేయుము. ఇటువంటి బిడ్డలతో వేగి నేనొక ఘడియయైన నీకొంపలోఁ గాలునిలుప లే"ననియెను.

చంద్రశేఖరుఁ డధోవదనుఁడై కూర్చుండెను. భువనేశ్వరి మరల నిట్లనెను. "నాతోఁగూడ బిడ్డ లలిత వచ్చెదననుచున్నది. పట్టుఱవికెలను కొన్ని తెప్పించితిని. బిడ్డకింక నేమయినఁ గావలయునేమో? చూచెదను".

చంద్రశేఖరుఁ డీమాటలు ముఖమెత్తి మందహాస మొనరించి "అమ్మా! నీవు దానిని తీసికొనపోయి, యింకనెవరితో జతఁగూర్చెదవు? తలంచుకొనినయెడల నీ వెంతలోఁ గూర్చె

దవులే! నీయాజ్ఞకంటె దాని కెక్కుడేమున్నది?" అనెను.

తనయుని స్మితవదనమును విలోకించి, భువనేశ్వరి యొకింత యాశాన్వితయై లలితను విలోకించి, «అమ్మా! వింటివా బావమాట? నాయాజ్ఞకన్న నధికమేమియు లేదనుచున్నాడు! నేను తలచుకొనినయెడల నాయిచ్చవచ్చిన తావునకు నిన్నుం గొనిపోవంగలనని యభిప్రాయపడుచున్నాడు బావ! నీమేనత్త యనుమతి పుచ్చుకొనన క్కఱలేదని వానియూహ" అనియెను.

లలిత యేమియు నుత్తరమొసంగలేదు. బావమాటల ధోరణిని గ్రహించి యామె యిపుడు సిగ్గుపడుచున్నది. నేటికిం దన హృదయేశునకుం దనపైం గృపకలిఁగెనని పసివట్టం గలిగి నంతనే యాలావణ్యమయి యొక్క ముఖసరోజము ప్రఫుల్లమై పోయినది.

చంద్ర—అమ్మా! లలిత మేనత్త యనుమతి యంత యనివార్యమని నేనుతలంపను. అయినను, చెప్పవలయునను నిచ్చకలదేని పిన్నతోఁగూడఁ జెప్పుము. అది నీయిష్టము. కాని, నీవు నీయనుమతిమాత్ర మొసంగితివేని కార్యము జరగిపోవును. అమ్మా! ఇట్లని నేనేకాక, నీతోఁగూడ రావలెనని యువ్విళ్లూరుచున్న నీ కోడలుకూడ యోజించుచున్నది.

అని చెప్పివైచి, చంద్రశేఖరుఁడు నతముఖుఁడాయెను.

విస్మయముచే భువనేశ్వరి స్తంభితయై పోయెను. కన్నతల్లితో నిదేమి పరియాచకము? ఆమె తన స్థిరదృష్టిని నందనునిపైఁ బఱపి "ఏమంటివి? లలిత నాకేమగునంటివి?" అనెను.

చంద్రశేఖరము శిరమెత్తి నేరకపోయెను, కాని మెల్లగ నుత్తరమొసఁగెను: "అమ్మా! నీ కది యేమిగునో చెప్పి యుంటిని కాదా? నేఁడుకాదు. లలిత నీకుఁ గోడలై సుమారు నాలుగు వత్సరములయినది. శైశవమునుండియు లలితనిన్ను 'అత్తా' యని పిలుచుచుండెను. నిజముగ నీవు దానికి అత్తవే యైతివి! అమ్మా! నేనిఁక విశేషము చెప్పఁజాలను. అంతయు లలితనే యడుగుము. అది నీతోఁ జెప్పుటకు సంకోచింపదు."

బావ పల్కులను విని లలిత నిజ గళమున నంచలిఁబెట్టి భువనేశ్వరికిఁ బ్రణమిల్ల నుద్యోగింప నతఁడదిచూచి శయ్యపైనుండి లేచివచ్చి లలిత పార్శ్వమున నిలిచెను. అపుడిరువు రొక్కమాతాయమ్మ పదప్రాంతమునఁబడి సాష్టాంగప్రణామ మాచరించిరి. ఆశీర్వాదము వడసినయంత నావవిత్ర మిథునము లేచి నిలువఁబడెను. అనంతర మేమియుఁ బలుకక నతవదనుఁడై చంద్రశేఖరుఁ డందుండి వెలుపలికి వెడలి పోయెను.

భువనేశ్వరి నేత్రయుగమునుండి యానందాశ్రువులు స్రవింప సాగెను. లలితపై నిజముగ నామె కెంతేని మక్కువయుండె ననియుఁ, బిన్ననాటగోలె నామెను దన తనూభవునితో సమముగ నామె ప్రేమించుచుండెననియుఁ జెప్పినదాని కింతకన్న తార్కాణముగావలయునా? అంత భువనేశ్వరి తన సింధుకముఁ దెఱచి, తన దివ్యాలంకారముల నన్నిఁటిని వెలికిఁదీసి, తన ముద్దుకోడలికి వాని నొక్కటొక్కటిగఁ బెట్టుచు, లలితా

చంద్రశేఖరుల రహస్య పరిణయోదంత విషయముల నొక్కొ క్కటిగ దన ముందునిలచిన పుత్తడి బొమ్మ నడిగి తెలిసికొని యెను. ఆవిచిత్రయుదంతమును సాంతముగ విని, యామ ««అందు వలననే నా గిరీశునకును అన్నపూర్ణకును పెండ్లి యైనది!'' అనియెను.

««అవు నందువలననే గిరీశుఁ డన్నపూర్ణ హృదయేశు డయ్యెను. అత్తా! గిరీశునివంటి పురుషుఁడు జగతియందింకొక్క డుండెనో లేఁడో చెప్పఁజాలను. నేనాతని కావిషయముఁ జెప్పగనే నిజముగనాకుఁ బరిణయమయ్యెనని యాతఁడు విశ్వ సించెను. నన్నుఁ బరిగ్రహించుటయుఁ బరిగ్రహింపక పోవు టయు బ్రాణేశునియిష్టము; కాని, నాకాయన నాలుఁగు వత్సరములకుఁ బూర్వమే ప్రాణేశుఁడయ్యెను''.

భువనేశ్వరి లలిత యుత్తమాంగమున్న కరమిడి ««అమ్మా! నీ ప్రాణేశుండును నీవును సుఖులై చిరంజీవులై జన్మ జన్మము లందు సతీపతులై యుండు''డని యాశీర్వదించి, ««అమ్మా! ఇందే యుండుము. పెండ్లికూఁతురు మాటెనని నీ బావ గారితో జెప్పివత్తు''నని, యాప్రేమమయి మందస్మితముఖయై జ్యేష్ఠనందనుని జూడనేగెను.

సంపూర్ణము.

# సరస్వతీ శాస్త్రపాఠములు [సైన్సురీడర్సు]

విద్యాధికారుల ప్రస్తుతనియమముల ననుసరించి వ్రాయబడినవి. అనేక చిత్రపటములు గలవు.

కర్త:-నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి.ఏ., బి.యిడి.,

| | | రు. | అ. | పై | | | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఒకటవతరగతి | 0 | 2 | 0 | 6. | మొదటిఫారము | 0 | 8 | 0 |
| 2. | రెండవతరగతి | 0 | 2 | 0 | 7. | రెండవఫారము | 0 | 9 | 0 |
| 3. | మూడవతరగతి | 0 | 3 | 0 | 8. | మూడవఫారము | 0 | 10 | 0 |
| 4. | నాలుగవతరగతి | 0 | 4 | 0 | 9. | నాలుగవఫారము | | | |
| 5. | అయిదవతరగతి | 0 | 5 | 0 | 10. | అయిదవఫారము | | | |

# భారతీవాచకములు

విద్యాధికారుల ప్రస్తుత నియమముల ననుసరించి ప్రస్తుతము వాడుకలోనున్న వాచకపుస్తకములకంటె బాలబాలికలకు సుబోధకముగ నుండునట్లు చక్కని శైలిని వ్రాయబడినవి.

| | | రు. | అ. | పై | | | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వ తరగతి | ... | 0 | 3 | 0 | 4 వ తరగతి | ... | 0 | 5 | 0 |
| 2 వ తరగతి | ... | 0 | 3 | 0 | 5 వ తరగతి | ... | 0 | 6 | 0 |
| 3 వ తరగతి | ... | 0 | 4 | 0 | | | | | |

# ఆర్యకథావళి

నీతి, భక్తి, ప్రభుమంత్రోత్సాహశక్తులు, యుక్తి, చాతుర్యము, వీరత్వము, శౌర్యము, ధైర్యస్థైర్యములు, మొదలగు ఆర్యధర్మములను పట్టుపడునటుల చేయు పురాణకథలు గల పుస్తకములు. మొదటి తరగతినుండి ఆరవ తరగతివరకు క్రమాభివృద్ధి గల శైలిలో వ్రాయబడినవి. చక్కని చిత్రపటములు చేర్చబడినవి.

మొదటి తరగతి
రెండవ తరగతి
మూడవ తరగతి
నాలుగవ తరగతి
ఐదవ తరగతి
ఆరవ తరగతి

# ENGLISH BOOKS

(For Indian children)

| | Rs. | A. | P. |
|---|---|---|---|
| Saraswathi English Reader First Book | 0 | 3 | 0 |
| Vasantasena P P 63 ... ... ... | 0 | 6 | 0 |
| Wonderful Dwarf P P 17 ... ... | 0 | 2 | 0 |
| Elementary Education for Indian boys and girls (Calico bound.) | 2 | 0 | 0 |

by Dr. V. Varahanarasimham, M.A., Ph.D.

# సరస్వతీ గణితము

విద్యాశాఖాధికారుల ప్రస్తుత నియమముల ననుసరించి వ్రాయబడిన ప్రారంభగణితము. బాలికాబాలకుల కత్యంతోపయుక్తమైనది.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| 1, 2, 3 తరగతులకు ఒకే పుస్తకము ... | 0 | 6 | 0 |
| నాలుగవ తరగతి పుస్తకము .. ... | 0 | 9 | 0 |
| ఐదవ తరగతి పుస్తకము ... ... | 0 | 12 | 0 |

# పుణ్యస్త్రీలు

ఉత్తమ నారీరత్నముల చరిత్ర లెన్నియో సేకరించి తరగతివారీగా మొదలు 8 వ తరగతివరకు ఇద్దఱు విదుషీమణులచే వ్రాయబడినవి.

ముచ్చటగు బొమ్మలు—ముద్దగు అచ్చు

# నీతికథానిధి

బాలబాలికలకు ఆసక్తి కలుగునటుల కథారూపమున చక్కని భాషలో వ్రాయబడినవి.

1 మొదలు 5 వ తరగతి వరకు సిద్ధమైనవి

# అనుబంధములు



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 మృత్యుతరంగిణి | 0 | 12 | 0 | | *9 యమునాబాయి | 0 | 12 | 0 |
| 2 అభాగిని | 0 | 12 | 0 | | †10 శ్యామల | 1 | 0 | 0 |
| 3 ఛద్మవేషి | 0 | 12 | 0 | | 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| *4 విదురుని యుపదేశములు | 1 | 0 | 0 | | 12 కాలసర్పి | 1 | 0 | 0 |
| *5 కాంచనమాల | 1 | 0 | 0 | | *13 భారతకథాసారం | 1 | 0 | 0 |
| †6 సీమంతిని | 1 | 0 | 0 | | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| *7 సుశీల | 1 | 0 | 0 | | 15 అరక్షణీయు | 1 | 0 | 0 |
| 8 శశిరేఖ | 1 | 0 | 0 | | 16 మాధవి | 0 | 12 | 0 |

పోస్టేజీ పైగా ధరించవలెను.



# నాటకములు



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| †1 మార్కండేయ నాటకము | 0 | 12 | 0 | | 4 వరమాల | 1 | 0 | 0 |
| †2 అహల్యాశాప విమోచనము | 0 | 12 | 0 | | 5 షాజహాను | 1 | 0 | 0 |
| 3 [illegible]పహరణము | 1 | 0 | 0 | | 6 నూర్జహాను | 1 | 0 | 0 |
| | | | | | 7 దుర్గాదాసు | 1 | 0 | 0 |
| | | | | | 8 చంద్రగుప్త | 1 | 0 | 0 |

* Approved by M. T. B. O for School use

† ... ... " for Libraries